20.10.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:40 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

# హరికృష్ణనూ మెల్లగా తప్పించే యోచన?

ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు ఈనాడు అధినేత శ్రీ రామోజీ రావుల స్నేహితం అలనాటి చంద్రగుప్త, చాణక్యుల కథను జ్ఞప్తికి తెస్తూంది. చంద్రబాబు శరీరమైతే, రామోజీ ఆత్మ



వలె కలిసి పోయి వున్నారిప్పుడు. పరిపాలనలో, ప్రభుత్వ నిర్వహణలో, పార్టీ రాజకీయంలో రామోజీని సంప్రదించనిదే అడుగు వేయలేకున్నారు ముఖ్యమంత్రి. మంచికో, చెడుకో తాను, తన పత్రిక సమర్థించిన చంద్రబాబు ప్రభుత్వం నాలుగు కాలాల పాటు నిలబడా లన్నది రామోజీ ఆశయంగా కన్పడుతూంది. ప్రభుత్వం ద్వారా పనులు చక్క బెట్టు కోవడానికి, వ్యాపారా వసరాలు తీర్చు కోవడానికి చంద్రబాబును నెత్తికెక్కించు కోవలసిన అవసరం రామోజీ రావు గారికి లేదు. ఆయనా స్థితిని ఎప్పుడో దాటి పోయాడు. హైదరాబాదులో ఎవరు అధికారంలో వున్నా, ఆయన పనులు అడగ కుండానే పరుగెత్తి చేసి పెట్ట వలసిన ఆగత్యం వుంది; "ఈనాడు" మహిమ అది. చంద్రబాబును పైకెత్తి, భుజాన వేసుకొని మోయడంలో వ్యాపార స్వార్థం కంటే; సాంఘిక ప్రతిష్ట, స్వాభిమాన సంతృప్తి అధికంగా వున్నట్లు అర్థం చేసుకోవచ్చు.

డాక్టర్ వెంకటేశ్వర రావును తరిమి పారేయడంలో చంద్రబాబు దృఢ సంకల్పం కంటే, రామోజీ చాణక్యం అసలు కారణమన్న సంగతి అందరికి తెలిసిందే. ఇప్పుడాయన దృష్టి హరికృష్ణ పై పడింది. హరికృష్ణను ఇదే స్పీడులో ప్రభుత్వంలో కొనసాగిస్తే ముప్పు తప్పదని వీరిద్దరూ భయపడు తున్నారు. ఎన్‌టిఆర్ వలెనే హరికృష్ణ కూడా ఆవేశ పరుడు; రాజకీయ పరిజ్ఞానం చాలా తక్కువ; నచ్చచెప్పి, ఓపిక పట్టి ఎప్పటి కప్పుడు హరికృష్ణకు సంబంధించిన నిర్ణయాలు తీసుకో వలసి వస్తున్నది. ఎప్పుడైనా విధిలేని పరిస్థితులలో అతడికి నచ్చని పని చేయవలసి వస్తే ఆవేశంతో తిరగబడి మాట్లాడి కొంప ముంచు తాడేమోనని చంద్రబాబు భయపడు తున్నాడు.

రామోజీ రావు గారి ఆలోచన వేరు. చంద్రబాబు పై ఇప్పటికీ ఎన్‌టిఆర్ కుటుంబ ముద్ర వుంది. ప్రభుత్వ నిర్వహణలో ఆ కుటుంబ ప్రస్తావన, ప్రమేయం అడుగడుగునా అడ్డు వస్తున్నాయి. ఎన్టీఆర్, ఎన్టీఆర్ ముద్దుల సతీమణి, ఎన్టీఆర్ కొడుకులు, ఎన్టీఆర్ కూతుళ్లు, ఎన్టీఆర్ అల్లుళ్లు, ఎన్టీఆర్ మనుమలు అందరూ ఏదో ఒక రూపంలో రాష్ట్ర రాజకీయంలో, ప్రభుత్వం మనుగడలో తమ జోక్యాన్ని, తమ ప్రభావాన్ని చూపుతున్నారు. ఈ వ్యవహార మంతా రాజుల కాలం నాటి ఫ్యూడల్ కుటుంబ పెత్తనం వలె జరిగి పోతూంది. దీనికి ఏదో ఒక స్థాయిలో ఫుల్‌స్టాప్ పెట్టకుంటే చంద్రబాబుకు ఎప్పటికైనా ప్రమాదమేనని రామోజీ భయం. వెంకటేశ్వర రావు నిష్క్రమణతో ఒక న్యూసెన్స్ పోయింది; ఎట్లయినా హరికృష్ణనూ వదిలించుకో గల్గితే ఆ కుటుంబ పీడ లేకుండా పోతుందని భావన.

> **రామోజీ, చంద్రబాబుల మాస్టర్ ప్లాన్ ఫలిస్తే హరికృష్ణకు ఆయువుమూడినట్లే!**

హరికృష్ణ ఎమ్మెల్యేగా ఎన్నిక కాకుండా నివారించ గల్గితే, పెద్ద సమస్య తప్పుతుందని వీరిద్దరూ భావిస్తున్నారు. ఆరు నెలల లోపల హరికృష్ణ శాసన సభకు ఎన్నికై తీరాలి. లేకుంటే మంత్రి పదవి నిలవదు. కృష్ణ జిల్లా నుంచి పోటీ చేయాలని ఆయన సంకల్పం. అయితే అందుకోసం తమ పదవిని త్యాగం చేయడానికి ఆ జిల్లా నుంచి ఏ ఎమ్మెల్యే ముందుకు రావడం లేదు. ఎవరో ఒకరు రాజీనామా చేస్తే తప్ప, ఖాళీ ఏర్పడదు కదా? ఈ విషయంలో చంద్రబాబు ఎటువంటి శ్రద్ధా చూపడం లేదు. ఏ ఎమ్మెల్యేకి నచ్చ చెప్పడానికి

కొరవ 11 పేజీలో

## అమెరికనాస్పత్రిలో అత్యాచారం ఆరోపణ

# ఎందుకింత ఆగం?

అమెరికనాస్పత్రిలో, నార్వే దేశస్తురాలైన యువతి సిగ్నె లైలాండ్ పై మానభంగ ప్రయత్నం జరిగిందని, అందుకు బాధ్యులైన వారిని అరెస్టు చేయాలని నెల్లూరులో పెద్ద ఆందోళన జరుగుతూంది. మహిళా సంఘాలు ధర్నాలు, ప్రదర్శనలు నిర్వహి స్తున్నాయి; అధికారుల మీద విపరీతమైన ఒత్తిడి తెస్తున్నారు.

> **ఆస్పత్రిలోని అంతర్గత రాజకీయాలే ఈ దుష్ప్రచారానికి కారణమా?**

ఎక్కడో, ఎన్ని వేల మైళ్ల దూరం నుంచో ఆస్పత్రిలో పని చేయడానికి వచ్చిన ఒక విదేశీ వనిత పై అత్యాచారం చేయబోవడ మంటే తీవ్రంగా ఖండించాల్సిన విషయం; అందుకు బాధ్యులైన వారు ఎవరైనా పట్టి కఠినంగా శిక్షించడమూ అవసరం. అయితే అటువంటి దుర్మార్గ ప్రయత్నం నిజంగా జరిగి వుండాలి కదా? అటువంటి సంఘటన జరిగి వుండాలి కదా? ఏమీ లేకుండా, ఏదీ జరగ కుండా, దేన్నీ నిర్ధారించు కోకుండా, నిజం తెలుసుకొనే ప్రయత్నం చేయకుండా కేవలం వూహలతో, అపోహలతో, అపార్థాలతో, అసూయతో, వ్యక్తిగత కక్షలతో కొందరిని ఎంపిక చేసుకొని మానసిక క్షోభ పెట్టడం, నూరేళ్ల చరిత్ర కల్గిన ఒక ఆస్పత్రిని అప్రతిష్ట పాల్జేయడం సమంజసమా? సముచితమా? మహిళా సంఘాలు చెప్తున్నట్లు అత్యాచారం జరిగింది నిజమా? డాక్టర్లు చెప్పినట్లుఆ యువతి మతి స్థిమితం తప్పి ప్రవర్తించి దనడం నిజమా? ఏది నిజం? ఏది అబద్ధం?

* * *

సిగ్నె లైలాండ్ నార్వే దేశస్తురాలు. మంచి వయస్సులో వుంది. ఇటీవల అమెరిక నాస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ దేవరాజ పూలా నార్వే వెళ్లినప్పుడు అక్కడొక సంస్థలో పరిచయ మైందట. తాను ఇండియాకు వస్తానని, కొంత కాలం పని చేస్తానని అడిగిందట. అందుకు సమ్మతించి డాక్టర్ పూలా ఆమెకు ఉద్యోగం ఇచ్చారు. సేవా భావంతో కాక, ఇక్కడ పని చేసినందుకు జీతం ఇచ్చే షరతు పైనే ఆమె వచ్చినట్లుంది. 1 తేది ఉద్యోగంలో చేరింది. కంప్యూటర్

కొరవ 8 పేజీలో

# బదలా వచ్చినా మార్కెట్ జడత్వం వదలడం లేదు!

ఫార్వర్డ్ ట్రేడింగ్ విషయంలో సెబి ప్రకటించిన నూతన విధానం పూర్తిగా బ్రోకర్లకు అనువైనది. మరొక రెండు నెలల్లో ఈ పద్ధతి ఆచరణకు వచ్చి, బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజిలో దీని ప్రకారం కార్యకలాపాలు మొదలౌతాయి. స్క్రీన్ బేస్డ్ ట్రేడింగ్ వున్న చోట మాత్రమే దీన్ని పాటించాల్సి వుంటుంది.

బదలా పద్ధతి పై సెబి నిర్ణయం ప్రకటించిన వెంటనే లిక్విడిటీ సమస్య పరిష్కార మౌతుందని అందరూ ఆశించారు. పెద్ద బ్రోకర్లు, ఆర్థిక నిపుణులు, మర్చంట్ బ్యాంకర్లు తదితరులు చేసిన పత్రికా ప్రకటనలు ఇన్వెస్టర్లలో ఆ భ్రమలు సృష్టించాయి. లిక్విడిటీ సమస్య తీరితే, మార్కెట్ లావాదేవీలు బాగా జరిగి, తమ దగ్గరున్న షేర్లను అసలుకైనా అమ్ముకోగల మన్న ఆశలు పెంచుకున్నారు. కానీ బదలా విధానం సైతం మార్కెట్‌కు జీవం కల్పించ లేకపోతున్నది. ఇండెక్స్ 3500 - 3600 మధ్యనే తిరుగాడు తూంది. ఒక రోజు రికవరీ జరిగితే, 4 రోజులు రియాక్షన్‌తో మార్కెట్ చలిస్తూ వుంది. అంటే కొత్త విధానం సైతం మార్కెట్‌లో లిక్విడిటీ సమస్యను పరిష్కరించ లేక పోయిందన్నమాట.

కొత్త బదలా విధానంలో రెండు మంచి షరతులు వున్నాయి. స్పెక్యులేషన్ లావాదేవీలు, డెలివరీ లావాదేవీలు విడి విడిగా వుండాలన్నది వాటిలో ఒకటి; స్పెక్యులేటివ్ లావా దేవీలన్నింటినీ 90 రోజుల లోపల పూర్తి చేయడం రెండవ షరతు. ఇవి తప్ప తక్కిన షరతులన్నింటి విషయంలోనూ బ్రోకర్ల ఒత్తిడికి లొంగి వారికి అనుకూలంగా విధానాన్ని రూపకల్పన చేయడం జరిగింది.

> **షేర్‌లోకం**
>
> డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్

బదలా విధానం ఇది వరకే వుండింది. 1993 లో దాన్ని నిషేధించారు. 1991 - 93 ల మధ్య దాదాపు 5 వేల కోట్ల రూపాయలు బదలా విధానంలో పెట్టుబడిగా వుండిన అంచనా. బ్రోకర్లు ఫైనాన్షియర్ల నుంచి పెద్ద పెద్ద మొత్తాలు వడ్డీకి తీసుకొని బదలా వ్యాపారం చేస్తారు. రు 3 ల వడ్డీ చెల్లింపు జరుగు తుంది. బదలా నిషేధం తర్వాత ఈ పెట్టుబడిని ఢిల్లీ, బొంబాయి, బెంగుళూరు నగరాలలో రియల్ ఎస్టేట్ వ్యాపారాలకు మళ్లించారు. ఇప్పుడా విధానం మళ్లీ అమలుకు వచ్చింది కాబట్టి, తిరిగి షేర్ మార్కెట్‌లోకి పెట్టుబడి తరలి వచ్చే అవకాశం వుంది. దీనివల్ల రియల్ ఎస్టేట్ వ్యాపారం మందగించ వచ్చు.

నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీలు కూడా ఇప్పుడు బదలా పద్ధతి పై మోజు చూపుతున్నాయి. ఆర్‌బిఐ అనుమతి లభిస్తే బదలా వ్యాపారులకు అప్పులివ్వడానికి వీరు సిద్ధంగా వున్నారు. ఈ అప్పులు లభిస్తే మార్కెట్‌లో లిక్విడిటీ సమస్య కొంచెం తగ్గుతుంది. షేర్ల ధరలు పెరుగుతాయి.

బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజిలో ఇప్పుడు రోజుకు రెండు వందల కోట్ల రూపాయల పరిమాణంలో వ్యాపారం జరుగుతూంది. రిలయన్స్, ఎస్‌బిఐ, టాటా స్టీల్, ఎల్ అండ్ టి వంటి పెద్ద కంపెనీల షేర్లు మాత్రమే చురుకుగా ట్రేడ్ అవుతున్నాయి. 95 శాతం వ్యాపారం వాటి పైనే వుంది. బ్రోకర్లు, ఆర్థిక సంస్థలు మార్కెట్ పట్ల ఇన్వెస్టర్లలో నమ్మకం పెంచడానికే ఈ పెద్ద షేర్లతో వ్యాపారం చేస్తూ, భ్రమలు సృష్టిస్తున్నారు. బి గ్రూప్ షేర్లను పట్టించుకునే వారు లేరు.

ఈ పరిస్థితులలో చిన్న ఇన్వెస్టరు మరి కొంత కాలం ఎదురు చూడడం అవసరం. కొనుగోళ్లకు దూరంగా వుండాలి. చాలా మంది చిన్న

కొరవ 11 పేజీలో

## నా షేర్లు కొనవద్దు

గంజాయి వనంలో తులసి మొక్కల వలె అప్పుడప్పుడు షేర్ మార్కెట్లలోనూ నిజాయితీగా, ధైర్యంగా వాస్తవాలు చెప్పే కంపెనీ నిర్వాహకులూ కన్పిస్తారు. అటు వంటి వ్యక్తి - శ్రీ అరుణ్ కాంత్ సేథ్. అతడు ప్రవాస భారతీయుడు. ఆయన ఇండియాలో ఐపి స్టోన్ ఇన్వెస్ట్ మెంట్స్ లిమిటెడ్ అనే ఫైనాన్స్ కంపెనీ ప్రారంభించారు. అందులో ఆయన, ఆయన స్నేహితులు కలిసి రెండు కోట్ల 25 లక్షలు పెట్టుబడి పెట్టారు. 75 లక్షల రూపాయలకు పబ్లిక్ ఇష్యూ విడుదల చేశారు. అది పది రెట్లు ఓవర్ సబ్‌స్క్రయిబ్ అయింది. అక్టోబరు 9 తేది లిస్ట్ కాగానే షేర్ విలువ రు 23 లతో మొదలై, తొలి రోజే రు. 50 లకు పెరిగి పోయింది. రెండు రోజులలో 50 వేల షేర్లు గబగబా చేతులు మారాయి.

ఈ సంచలనాన్ని చూసి అరుణ్ కాంత్ సేథ్ వెంటనే ఒక ప్రకటన చేశారు - తన "షేర్లను ఎవరూ కొనవద్దు" అని; "నా కంపెనీ షేర్ విలువ రు. 13 లు మించదు. కంపెనీలో వెంటనే లాభాలు వచ్చే అవకాశం లేదు. దీర్ఘ కాలంలో మాత్రమే లాభాలు వస్తాయి. రానున్న మూడు సంవత్సరాల కాలంలో ఇపిఎస్ ఒక్క రూపాయికి మించే అవకాశం లేదు. అందువల్ల ఈ ధరలలో నా షేర్లను ఎవరూ కొనవద్దు" అని ఆయన ప్రకటన చేశారు.

ఇటువంటి సత్తె కాలం మనుషులూ ఇంకా వున్నారా?

## ప్రభుత్వ కంపెనీల షేర్లు కొనే వారు లేరు!

ప్రభుత్వ రంగ సంస్థల షేర్ల అమ్మకం ద్వారా ఈ ఆర్థిక సంవత్సరంలో ఏడు వేల కోట్ల రూపాయలు సమీకరించు కోవాలని ఆర్థిక మంత్రి మన్‌మోహన్ సింగ్ బడ్జెట్‌లో చేసిన ప్రతిపాదన అమలయ్యే సూచనలు కన్పించడం లేదు. అక్టోబరు 9 తేది షేర్ల అమ్మకం మొదలైంది. స్టీల్ కంపెనీ సెయిల్, ఒఎన్‌జిసి, ఎంఎన్‌టిఎల్, కంటైనర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా తదితర కంపెనీల షేర్లను

కొరవ 11 పేజీలో

# బిజెపి నిజరూపం

ఉత్తర ప్రదేశ్ ముఖ్య మంత్రి కుమారి మాయావతిని వున్నట్టుండి కాళ్లు పట్టి క్రిందకు లాగి పడవేశారు బిజెపి నాయకులు. ఒక వైపు గుజరాత్‌లో నాయకుడు ఎవరన్న చిక్కు ముడిని విప్పలేక, పార్టీ పరువుకు గంగలో తిలా తర్పణ మర్పిస్తున్న సమయంలోనే, బిజెపి ఈ నిర్ణయం తీసు కోవడం విశేషం. అధికార తాపత్రయమనే నయం కాని రాజకీయ అంటు వ్యాధి బిజెపికి సంపూర్ణంగా సంక్రమించినట్లు ఈ రెండు సంఘటనలూ రుజువు చేస్తున్నాయి.

మాయావతిని గద్దె నెక్కించి పట్టుమని పాతిక వారాలు గడవ లేదు. అయోధ్య దురంతర సృష్టి ద్వారా హిందూ మతోన్మాదం పెచ్రేగి, తమ ప్రాభవం మధ్యందిన మార్తాండ ప్రకాశంతో విరాజిల్లుతున్న సమయంలో, ములాయం సింగ్ యాదవ్ కేతువు వలె తమ ఓట్ల బ్యాంకును కొరుక్క తినేయడం చూసి భయపడి, గత్యంతరం లేక ఆ రోజు మాయావతిని గద్దెనెక్కించారు బిజెపి నేతలు. అసెంబ్లీలో పదవ వంతు బలం లేకున్నా ఆమెను ప్రభుత్వాధినేతగా నిలబెట్టారు. కేవలం ఆనాటి రాజకీయావసరంతో తీసుకొన్న ఈ నిర్ణయానికి మసి బూసి, మారేడు కాయ చేసి తమను తాము దళిత జనోద్ధారకులుగా దండోరా వాయించు కున్నారు బిజెపి నేతలు. మాయావతి మహా దళిత నాయకురాలిగా కన్పించింది వారికా నాడు. దళిత మహిళను ముఖ్య మంత్రిని చేసిన ఘనతర శక్తిగా తమను గుర్తించి దేశమంతటా దళితులు తమ ఒడిలో ఓట్ల రాశులు క్రుమ్మరిస్తారని భ్రమసి మురిసి పోయారు. కాని మేక తోలు కప్పుకొన్నంత మాత్రాన పైన బడను వచ్చిన పులి ఏదో, మేక ఏదో తెలుసు కోలేనంత అమాయకులు కాదు దళితులన్న నిజం రుజువు కావడంతో; మాయావతి నిర్ణయాల వల్ల సాంప్రదాయ బద్ధంగా తమకు వచ్చే సవర్ణ హిందూ ఓట్లు సైతం జారి పోతాయని భయపడి, అప్పటి కప్పుడు ఏదో ఒక సాకు వెతికి ఆమెను క్రిందకు దించి వేశారు. రాజకీయాలలో నీతి నియమాలకు, మాట కట్టుబాటుకు పరిగణన ఇవ్వని దురక్షణానికి బిజెపి సైతం అతీతు రాలేమీ కాదని ఈ సంఘటన నిరూపించింది. మాయావతిని గద్దె నెక్కించే టప్పుడు తమది బేషరతు మద్దతు అని, ప్రభుత్వ నిర్వహణలో వేలు పెట్టమని బిజెపి ప్రకటించింది. కాని ఆ తర్వాత అడు గడుగునా ఆమెకు ప్రతిబంధకాలు సృష్టించారు; లేని పోని తప్పులెత్తి చూపి ఇంటికి పంపారు. భవిష్యత్‌లో మరే పార్టీ కూడా బిజెపిని నమ్ము కొని మిశ్రమ ప్రభుత్వాలను ఏర్పర్చడం వ్యర్థమని; వారు నడి ఏటిలో నావను ముంచి వేసి తప్పుకోగల పెద్ద మనుషులని దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

క్రమశిక్షణ, నిబద్ధత కల్గిన కార్యకర్తల బలం కల్గిన పార్టీగా తమకు తాము తప్పెట వాయించుకొనే బిజెపి నాయకులు గుజరాత్‌లో నాయకత్వ సమస్యను పరిష్కరించ లేక చతికిల బడుతున్న తీరు నవ్వు పుట్టిస్తున్నది. అసమ్మతి నాయకుడు శంకర్ సింగ్ వాఘెలె బ్లాక్ మెయిల్‌కు భీరువుల వలె తలదించి, నాయకత్వం మార్పుకు నమ్మ బలికిన పెద్దలు, ఇప్పుడు ముఖ్యమంత్రి కేశుభాయ్ పటేల్ ఒత్తిడికి తట్టుకోలేక ఆయన స్థానంలో ఎవరిని పెట్టాలో అర్థం కాక రెండు వారాలకు పై నుంచి పిచ్చి వాళ్లై పోయి వున్నారు. కరవ మంటే కప్పకు, విడవ మంటే పాము కోప పడు తుండడంతో ఏ నిర్ణయం తీసుకోవడానికి పాలు పోవడం లేదు వారికి; అగ్ర నాయకత్వం మాటకు క్రింది స్థాయి నాయకులు చీపుర పుల్ల పాటి విలువ ఇవ్వని దుస్థితి బిజెపికి సంక్రమించడం నిజంగా ఆశ్చర్య పడవలసిన విషయమే. ఎవరికి వారు పెద్దలుగా చలామణి అయ్యే కాంగ్రెస్‌లో సైతం ఢిల్లీ నుంచి ఆదేశం వస్తే కిక్కురు మనకుండా సర్దుకు పోయే పరిస్థితులలో, బిజెపి నియంతైన వాజ్ పేయ్ స్వయంగా అహమ్మదా బాద్‌లో రోజుల తరబడి కూర్చుని, అందరి కాళ్లు గడ్డాలు పట్టుకొని బ్రతిమ లాడుతున్నా సమస్య పరిష్కారం కాకపోవడం ఆ పార్టీకి కోలుకోలేని అవమానం క్రిందే లెక్క.

**జమీన్‌రైతు**

సమర్థ వంతమైన నాయకత్వాన్ని, పటిష్టమైన ప్రభుత్వాన్ని తామైతేనే ఇవ్వగలమని, పరిపాలనను నడప గలమని బిజెపి పలవ రించే ప్రగల్భాల పస ఈ రెండు రాష్ట్రాల పరిణామాలతో తేలి పోయింది; వారి నిజ స్వరూపం బట్ట బయలైంది; ఇతర పార్టీలను విమర్శించే నైతిక హక్కును కోల్పోయారు వారు. రానున్న పార్లమెంట్ ఎన్నికలలో వారి మాట లెవరూ నమ్మరు; నమ్మడానికి లేదు.

---

## జమీన్‌రైతు

19.10.1945

సం: 0-1-6 సంచిక:8

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### ఎలెక్షన్ కబుర్లు

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ కార్యవర్గం 12 తేదిన, జనరల్ బాడీ 13 తేదిన బెజవాడలో సమావేశమై కేంద్ర శాసన సభకు కాంగ్రెస్ అభ్యర్థుల నిర్ణయించింది.

ఆంధ్ర రాష్ట్రమునకు ఆరు స్థానాలు. వీటికి గాను, కాంగ్రెస్ టిక్కెట్లకై 31 మంది రాష్ట్ర కాంగ్రెస్‌కు దరఖాస్తులు పెట్టుకున్నారు.

విశాఖ, గంజాం నియోజక వర్గమునకు శ్రీ న్యాయపతి నారాయణ మూర్తి గారిని, ఉభయ గోదావరి - కృష్ణా నియోజక వర్గముకు శ్రీ వడ్లపట్ల గంగరాజు గారిని, గుంటూరు - నెల్లూరు నియోజక వర్గముకు ఆచార్య రంగా గారిని, రాయలసీమ నియోజక వర్గమును అనంత శయనం గారిని కాంగ్రెస్ అభ్యర్థులుగా నిర్ణయించటం జరిగింది.

కాంగ్రెసు టిక్కెట్టుకై దరఖాస్తు పెట్టుకున్న వారంతా గూడ హృదయ పూర్వకముగ యీ నిర్ణయాన్ని బలపరుస్తున్నారు.

"కాంగ్రెస్ ఎవరిని నిలిపినా మా అందరికీ అంగీకారమే. వారు సార్థకమైనంత వరకు పోటీ లేకుండగనే యెన్నుకొనబడేట్లు మా శాయశక్తుల కృషి చేస్తాం" అను వాతావరణం మధ్య కాంగ్రెస్ అభ్యర్థుల నిర్ణయం జరిగింది.

### ఎండమావుల గాంచి భ్రమపడనేల?

కాంగ్రెసు నిర్దేశించిన విధానము ననుసరించి నట్లయితేనే ముస్లింల భవిష్యత్తు సురక్షితము కాగలదు భారత రాజకీయోద్యమము అనేక మజిలీల గుండా ముందుకు నడుస్తూ వచ్చింది. మనము యాత్ర ప్రారంభించి యాభైయేళ్ల యింది. ఇప్పుడు చివరి మజిలీ చేరుకున్నాము ఇక గమ్యస్థానము ఎక్కువ దూరంలో లేదు. మనమీ కంటకిత పథంలో నడుస్తూ అనేక బాధలను అనేక క్లేశాలను అతిక్ర మించాము. అయినప్పటికీ ప్రతి క్షణము లక్ష్యము వైపుకే ముందడుగు వేస్తూ వచ్చాము. గమనము చేరుకుంటున్న ఈ సమయంలో పాత సమస్యల గూర్చి చర్చలు కాని వివాదాలు కాని ఇప్పుడు అప్రస్తుతము. ఒక అంత్య లక్ష్యము పై దృష్టి నిలపండి. యిప్పటి రాజకీయ పరిస్థితులలో అనేక జటిల విషయాలున్నై. నిజమే ఒక సంస్థ మీద యింకొక సంస్థకు అనుమానము, అవిశ్వాసము, ముస్లిం మనస్సులలో కూడా ఆశంక, అనుమానము లేకపోలేదు. దేశ భవిష్యత్తు విషయమై వీరికి గల ఆశంకలను తొలగించ వలసి యున్నది.

కొరవ 11 పేజీలో

---

# ఆంధ్రుల ఆత్మగౌరవం ఆంధ్రలోనే మంట గలుస్తోంది!

చంద్రబాబు దగ్గరున్న సమయంలో ఎమ్మెల్యే దగ్గుపాటి వెంకటేశ్వర రావు లక్ష్మి పార్వతిని తిరిగి ఎర్ర బస్సు ఎక్కిస్తానని సవాల్ విసిరారు. మంత్రి వర్గ విస్తరణలో తాను కోరుకొన్న ఉప ముఖ్యమంత్రిత్వం రాలేదని అలిగి తిరిగి మామ ఎన్టీ రామారావు పక్షాన చేరారు. వెంకటేశ్వర రావు పదవీ వ్యామోహం లేని వాడని, పెద్ద మనిషని ఇంతకు ముందు పేరుండేది. ఇప్పుడు ఆయన అనుసరించిన తీరు వల్ల ఆ పేరు మట్టి కొట్టుకొని పోయి, ఆయన నిజ రూపం ప్రజలకు తెలిసింది. ఇంతకు ముందు మాజీ ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు తన ప్రసంగాలలో ఆంధ్రుల ఆత్మాభిమానం ఢిల్లీలో మంట గలసి పోతున్నదని ఆక్రోశించేవారు. కాని ప్రస్తుతం అధికారం కోసం ఆ కుటుంబం పడుతున్న ఆరాటం - పోరాటం చూస్తుంటే ఆంధ్రుల ఆత్మాభిమానం హైదరాబాద్ బంజారాహిల్స్‌లోనే మంట గలిసి పోతున్న దన్పిస్తోంది. ఈ విషయాన్ని ప్రజలు గమనించి తెలుగు తమ్ముళ్లకు తగిన బుద్ధి చెప్పాలి.

గంగవరం -జి.రామకృష్ణప్రసాద్

## జనవాణి

### ఓటర్ల గుర్తింపు ఫోటోలు- అవకతవకలు

హాస్టల్, నిప్పో కాలని ఓటర్లకు 15 తేది ఉదయం 7 గంటలకు జిల్లా పరిషత్ హై స్కూల్లో ఫోటోలు తీస్తారని మైకులో చెవులు తూట్లు పడేట్లు చెప్పారు. ఆ ప్రాంత ప్రజలు ఆ సమయానికి ఆ కేంద్రానికి వెళ్తే ఫోటోలు తీసే సిబ్బంది అక్కడ లేరు. తిరిగా 9 గంటల కొచ్చారు. కొందరు ఓటర్లు ఈలోగా వెళ్లిపోతే, మరి కొందరు ప్రభుత్వం విధించిన శిక్ష అనుభవించే వారి వలె అక్కడే నిలబడ్డారు. వచ్చిన వారు అప్పటి కప్పుడు కుర్చీలు, బెంచీలు వెతుక్కో వలసి వచ్చింది. వీడియో గ్రాఫర్లకు ఓటర్ల పేరు, నెంబరు వ్రాసుకొనేందుకు పలకలు లేవు. వాటి కోసం బజారుకు పరుగెత్తారు. మరో ముఖ్య విషయ మేమిటంటే 15 తేది

కొరవ 8 పేజీలో



అభిమాన, అనుచర జన సందోహం మధ్య అంత్యక్రియలకు తరలింపబడుతున్న పెళ్ళకూరు రామచంద్రా రెడ్డి గారి భౌతిక కాయం; ఫోటోలో వారి కుమారులు ప్రభాకర రెడ్డి, వసంత కుమార రెడ్డి.

# ప్రధాని పివి తమ మిత్రుడి స్వప్నం నిజం చేయాలి!

పెళ్లకూరు రామచంద్రా రెడ్డి సంతాప సభను జిల్లా కాంగ్రెస్ కమిటీ ... ఇందిరా భవన్‌లో ... మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి ... రెడ్డి, అసెంబ్లీలో కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకుడు పి. జనార్ధన రెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, మాజీ మంత్రి పసల పెంచలయ్య, మాజీ ఎమ్మెల్యేలు సివి శేషారెడ్డి, పట్రా ప్రకాశ రావు, డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి అధ్యక్షతన సమావేశ మయ్యారు. కాంగ్రెస్ కార్యకర్తలు, పెళ్లకూరు అభిమానులు విరివిగా సంతాప సభకు విచ్చేశారు. నేదురుమల్లి జనార్ధన రెడ్డి మాట్లాడుతూ జిల్లాలోని కాంగ్రెస్ నాయకుల్లో మంచి వ్యక్తిగా పేరు గడించిన వాడు పెళ్లకూరు రామచంద్రా రెడ్డి ఒక్కడే నన్నారు. ఆయన వద్దకు ఎవరు వెళ్లినా, నోటి నిండా నవ్వి, హృదయ పూర్వకంగా ఆహ్వానించే వాడు. సత్సంగం, పీఠాధి పతులతో నేరుగా సంబంధాలు కల్గి వుండిన ఘనత జిల్లాలో రామచంద్రా రెడ్డి ఒక్కడికి వున్నట్లు చెప్పారాయన. ఇఫ్కో కు దక్షిణ భారత దేశంలో ఆఫీసులే లేవు. రామచంద్రా రెడ్డి అధ్యక్షు డయ్యాక నంద్యాలలో నష్టాలలో వున్న చక్కెర ఫ్యాక్టరీని విజయ వంతంగా నడపడంతో పాటు, పురుగుల మందుల ఫ్యాక్టరీని నెలకొల్ప సంకల్పించి పేరు తెచ్చుకున్నారు. నెల్లూరు జిల్లాకు ఏదో ఒకటి చేసి తన పదవికి సార్థకత చేకూర్చేందుకే రాచర్లపాడులో ఇఫ్కో ఫ్యాక్టరీని సాధించి పెట్టాడు. తాను దైవంగా భావించే ప్రధాని చేత

## పెళ్ళకూరు సంతాప సభ

ప్రారంభోత్సవం చేయించాలనే కోరికలో వుండగా మృత్యు దేవత ఆయన పై నిర్దయ చూపింది. తన మిత్రుని చిరకాల స్వప్నాన్ని నెరవేర్చను పివి నరసింహా రావు ఫ్యాక్టరీకి శంకుస్థాపన చేసి, దానికి పెళ్లకూరు రామచంద్రా రెడ్డి పేరు పెట్టాలని సూచించారాయన. లెజిస్లేచర్ పార్టీ నాయకుడు పి. జనార్ధన రెడ్డి మాట్లాడుతూ తాను కొత్తగా అసెంబ్లీలో ప్రవేశించిన రోజుల్లో యువ శాసన సభ్యులను రామచంద్రా రెడ్డి అమితంగా ప్రోత్సహించిన విషయాన్ని గుర్తుకు తెచ్చుకున్నారు. రాచర్లపాడు స్థల విషయం పై అసెంబ్లీలో ప్రస్తావించమని తనను ఒకసారి కలసినట్లు జనార్ధన రెడ్డి చెప్పారు. డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి - తాను, పెళ్లకూరు ఎస్.ఎస్.ఎల్.సి. నుంచి మంచి మిత్రుల మంటూ ఆయన నిత్యం 50 మందికి అన్నదానం చేసి పుణ్యాన్ని మూట కట్టుకొని దివికేగినట్లు చెప్పారు. మునిసిపల్ ఛైర్మన్ వివేకానంద రెడ్డి రామచంద్రా రెడ్డి కాంగ్రెస్ పార్టీలో సాధువు వంటి వారన్నారు. సర్వేపల్లి మాజీ శాసన సభ్యుడు సివి శేషారెడ్డి మాట్లాడుతూ పార్లమెంటు ఎన్నికల ముందు పెళ్లకూరును కోల్పోవడం కాంగ్రెస్ పార్టీకి ఎంతో నష్టమన్నారు. జీవితాంతం పివి నాయకత్వంలోనే వుండడం రామచంద్రా రెడ్డి వ్యక్తిత్వానికి నిదర్శనమని మాజీ మంత్రి పసల పెంచలయ్య చెప్పారు. ఇతర భాషలు మాట్లాడడం రాక పోయినా లౌకికంగా విదేశాల్లో కూడా ఇఫ్కో ఫ్యాక్టరీలు స్థాపించిన ధన్యజీవిగా ప్రదేశ్ కాంగ్రెస్ పార్టీ ఉపాధ్యక్షుడు పట్రా ప్రకాశ రావు పెళ్లకూరును పొగిడారు. అనంతరం పార్టీ తరపున సంతాప తీర్మానాన్ని ఆనం సంజీవ రెడ్డి ప్రతిపాదించడంతో సభికులు సంతాప సూచకంగా లేచి నిలబడి మౌనం పాటించారు.

### ఇమ్‌కాప్స్ డైరక్టరుగా నెల్లూరీయుడు

మద్రాసులోని ఇండియన్ మెడికల్ ప్రాక్టీషనర్స్ కో ఆపరేటివ్ ఫార్మసీ అండ్ స్టోర్స్ లిమిటెడ్ డైరక్టరుగా నెల్లూరీయుడు డాక్టర్ అబ్దుల్ ఖాదర్ అలియాస్ చాన్ బాష నియమితు లయ్యారు. నెల్లూరు, గుంటూరు, కృష్ణా జిల్లాల పరిధిలోని ఆయుర్వేద, యూనాని, సిద్ధ విధానంలో వైద్యం చేసే డాక్టర్ల మధ్య జరిగిన పోటీలో చాన్ బాష ఎన్నికయ్యారు. ఇమ్‌కాప్స్ దక్షిణ భారత

తరువ 8 పేజీలో





# నవంబర్‌లో మార్కెట్‌కు మోక్షం!

## - రమేష్‌రెడ్డి అభయం

కోటి రూపాయలకు పైగా ఖర్చు పెట్టి మద్రాసు బస్టాండు వద్ద మార్కెటింగ్ శాఖ ఆధ్వర్యంలో కట్టిన మార్కెట్ పనులు ఏడాది క్రితమే పూర్తయినా ప్రారంభానికి నోచుకోలేదు. కొత్తగా మార్కెటింగ్ శాఖకు మంత్రిగా వచ్చిన నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ టి. రమేష్ రెడ్డి పుణ్యాన ఈ మార్కెట్‌కు మోక్షం లభించ నుంది. మార్కెట్ భవనాన్ని 13 తేది సందర్శించిన మంత్రి దీన్ని నవంబరు నెలలో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చేత ప్రారంభోత్సవం చేయిస్తానని చెప్పారు. ఛైర్మన్‌గా వున్నప్పుడు మార్కెట్ ఏర్పాటు కోసం కష్టపడి కృషి చేసా; తిరిగి ఆ మార్కెట్టు భవనాన్ని మంత్రిగా వచ్చి ప్రారంభించడం తన ఆరాధ్య దైవం షిర్డి సాయిబాబా దయగా మంత్రి చెప్పుకొన్నారు. స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డి అప్పటి జనాభాను దృష్టిలో వుంచుకొని చిన్నబజారు మార్కెట్‌ను ఏర్పాటు చేసారని, ప్రస్తుతం పట్టణ ప్రజలకు ఆ మార్కెట్ చాలడం లేదని వివరించారు. అందువల్ల ఆ మార్కెట్‌ను ఇక్కడకు మారిస్తే పలు సమస్యలు తీరి పోతాయని చెప్పారు. చంద్రబాబు నాయకత్వంలో పనిచేసే తాను, ఆయన అడుగు జాడలలో నడవాలనే సంకల్పంతో ఇక నుండి పూలమాలలు, సత్కారాలు చేయించు కోనని ప్రతిన బూనినట్లు విలేఖరులకు చెప్పారు. ఈ మంచి ఆలోచన మంత్రిగా నెల్లూరులో కాలిడిన మొదటి రోజునే వుంటే బాగుండేది కదా?

### రమేష్‌రెడ్డికి తుమ్మల సుబ్బారెడ్డి సన్మానం

మార్కెటింగ్ శాఖామాత్యులు టి. రమేష్ రెడ్డికి నెల్లూరు ఎక్స్‌ప్రెస్ పత్రికా కార్యాలయంలో ఆ పత్రిక నిర్వాహకుడు తుమ్మల సుబ్బారెడ్డి 14 తేది సన్మానం జరిపారు. మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, వైస్ ఛైర్మన్ దశరథ రామయ్య, పలువురు కౌన్సిలర్లు, చిన్న పత్రికల సంపాదకులు ఈ కార్యక్రమం పాల్గొన్నారు.

## ఫోటోల ప్రహసనం

# ఓటర్లకుత్సాహం వున్నా అధికార్లలో ఆసక్తి, అనుభవం కరువైనాయి!

టౌన్‌లో ఓటర్ల గుర్తింపు కార్డుల కోసం 14, 15 తేదీల్లో నిర్వహించిన వీడియో ఫోటోగ్రఫీ కార్యక్రమం ఒక ప్రహసన మయ్యింది. ఒకే రోజులో కార్యక్రమం పూర్తి చేయాలన్న ఆంక్షను విధించడం వల్ల టౌన్‌లో 72 వేల మందికి పైగా ఫోటోలు తీయించు కోలేక పోయారు. అధికార్లు ముందుగా ప్రకటించినట్లుగా ఉదయం 7 గంటలకే పోలింగ్ కేంద్రాలకు ఉత్సాహ వంతులైన ఓటర్లు కొందరు తరలి వెళ్తే, ఆ సమయానికి ఈ కార్యక్రమం నిర్వహించే సిబ్బంది రాలేదు. పోనీ సాయంత్రం కార్యక్రమం ఒక గంట పొడిగించారా అంటే అదీ లేదు. ఫోటోలు తీయడానికి ఏర్పాటు చేసిన పలు స్కూళ్లలో విద్యుత్ వసతి లేక పోవడం వల్ల ఆరు గంటలకే వివిధ చోట్ల అధికారులు పుస్తకాలు, కెమెరాలు సర్దుకొని వెళ్లి పోయారు. టౌన్‌లో అప్పటికి నమోదై వున్న ఓటర్లు 2,05,874 మందికి 13,776 మంది జత కలిసారు. వీరిలో చాలా మంది కొత్తగా పేర్లు నమోదు చేసుకొనేందుకు ఫారం నంబరు 6 ను బజారులో కొనుక్కోవలసి వచ్చింది. వీటిని అందించడంలో అధికారులు పూర్తిగా విఫల మయ్యారు. టౌన్‌లో ఫోటోలు తీయించు కోమని స్లిప్పు పంచే కార్యక్రమంలో ఉపాధ్యాయులను తప్పించి, రెవిన్యూ సిబ్బందిని వాడు కోవడం వల్ల మరింత కొడిగా పని జరిగి వీడియో కేంద్రాల వద్ద జనం బారులు తీయ వలసి వచ్చింది. ప్రభుత్వం సరఫరా చేసిన ఓటర్ల లిస్టులో ప్రింట్ చేసిన అక్షరాలు చీమ తలలంత వుండడం వల్ల నమోదు అధికారులు కూడా పలు బాధలు పడ్డారు. ఫోటోలు తీయించు కోకుంటే సర్వం నష్ట పోతారని ప్రచారం చేయడంతో 14 తేది, 1,02,923 మందికి 63,726 మంది 15 తేది 1,20,951 మంది 70 వేల మంది కష్ట నష్టాల కోర్చి ఫోటోలకు దిగారు. ముస్లింలు ఎక్కువగా నివసించే జండా వీధి, డైకస్ రోడ్డు, కోటమిట్ట, బారెక్స్ ప్రాంతాల్లో మహిళలు ఈ ఫోటోల పట్ల స్పందనే చూపలేదు. మొదటి దశలో ఫోటోలు తీసే కార్యక్రమంలో అనేక తప్పులు

## నెల్లూరు సంగతులు

జరిగాయని ఆర్డీఓ కుమారి టి. శ్రీదేవి అంగీకరించారు. రెండవ దశలో లోపాలు లేకుండా సవరిస్తా మన్నారామె. మునలి ముతక కోసం ఇంటి కొచ్చి ఫోటోలు తీసే కార్యక్రమానికి తర్వాత తేదిలు ప్రకటిస్తా మన్నారు. ఓటర్లను గుర్తించే దానికి దొంగల్లా నెంబర్లు వ్రాసి పలకలు చేతికిచ్చి ఫోటోలు తీసే దాని కన్నా మంచి ఆలోచన అధికారుల మదిలో మెదల లేదా?

## నెల్లూరు ముచ్చట్లు

విలక్షణుడు

### పెళ్ళకూరు అంత్యక్రియలు-ప్రధాని సంతాపం!

ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్ళకూరు రామచంద్రా రెడ్డి గారి అంత్య క్రియలు 14 తేది సాయంత్రం 3 గంటలకు పూర్తి అధికార లాంఛనాలతో జరిగాయి. 13 తేది ఉదయం 11 గంటలకు ఆయన భౌతిక కాయాన్ని మద్రాసు నుంచి అంబులెన్స్‌లో తీసుక వచ్చి, పప్పుల వీధిలోని అనసూయమ్మ కళ్యాణ మండపంలో వుంచారు. వేల సంఖ్యలో జనం వచ్చి ఆయనకు శ్రద్ధాంజలి ఘటించారు. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి, మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి, ప్రధాని పివి సోదరుడు శ్రీ మనోహరరావు, కుమారుడు శ్రీ రాజేశ్వర రావు, ఇతర కుటుంబ సభ్యులు, మంత్రులు రమేష్ రెడ్డి, దుర్గా ప్రసాద్, ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి తదితర ప్రముఖులంతా ఆయనకు అంజలి సమర్పించారు.

ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు స్టేట్ ఫ్యూనరల్ హానర ప్రకటించడంతో పెళ్ళకూరుకు పోలీసు వందనం, మూడు సార్లు గాలిలో తుపాకి కాల్చి గౌరవం ఇచ్చారు. పెన్నానది ఇసుకలో అంత్యక్రియలు జరిగాయి. పెద్ద కుమారుడు శ్రీ వెంకట సుబ్బారెడ్డి చితికి నిప్పంటించారు.

* * *

ప్రధాని శ్రీ పివి 14 తేది ఉదయం టెలిఫోన్‌లో పెళ్లకూరు చిన్న కుమారుడు వసంత కుమార రెడ్డికి ఫోన్ చేసి సంతాపం తెలిపారు. నవంబరు మొదటి వారంలో నెల్లూరు వచ్చి, కుటుంబ సభ్యులను పలకరిస్తానని చెప్పారు.

### మాగుంట శవ రాజకీయం

మాగుంట సుబ్బరామ రెడ్డి గారికి ఇంకా రాజకీయ అనుభవం వచ్చినట్లు లేదు. పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి అంత్యక్రియలు జరగక ముందే, అదే కళ్యాణ మండపంలో ఆయన నడిపిన శవ రాజకీయాలు ఎబ్బెట్టుగా, వికారంగా వుండినాయి. పెళ్లకూరు గౌరవ సూచకంగా, డిసిసి తరఫున సంతాప సభ నిర్వహిస్తున్నట్లు ఆనం సంజీవ రెడ్డి 13 తేది ఉదయం ప్రకటించారు. అది పత్రికలలోనూ వచ్చింది. కానీ ఆ మధ్యాహ్నం వున్నట్లుండి వూడిపడిన సుబ్బరామ రెడ్డి గారు అదే సమయానికి అదే కళ్యాణ మండపంలో తన స్వంత సంతాప సభ ప్రకటించారు. శవం ఎదురుగా కూర్చొని ఆ సభకెవరు, ఈ సభకెవరు అన్న చర్చ జరుపుతూ, బ్యానర్లు, కుర్చీలు ఏర్పాటు చేయిస్తూ ఆయన హడావుడిగా తిరుగు తుంటే చూసే వారికి ఇబ్బందిగా వుండింది.

రాజకీయ బల ప్రదర్శనలకు అంత్యక్రియలు, సంతాప సభలు వేదిక కావటం విచారించ దగిన విషయం. దేనికైనా సమయు, సందర్భా లుండాలి కదా? సుబ్బరామ రెడ్డి గారు ఎప్పటికి తెలుసు కుంటారో, ఏమో!

### ట్యూషన్ల పై స్టే

కలెక్టర్ శ్రీ గిరిధర్ టోపీలో కాలేజి లెక్చరర్ల ట్యూషన్ల పై జరుపుతున్న సమరానికి హై కోర్టు సడన్ బ్రేక్ వేసింది. వి.ఆర్, సర్వోదయ, వేణుగోపాల స్వామి కాలేజిలకు సంబంధించిన 17 మంది విద్యార్థిని, విద్యార్థులు వేసిన పిటిషన్ పై మధ్యంతర ఉత్తర్వులు జారీ చేస్తూ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ బి. సుభాషన్ రెడ్డి ట్యూషన్ల విషయంలో ఎటువంటి జోక్యమూ చేసుకో వద్దని కలెక్టర్‌ను, ప్రిన్సిపల్లను ఆదేశించారు.

### రామస్వామి రెడ్డి అరెస్టు

నిర్మల సోదర త్రయంలో చివరి వాడు నిర్మల కాఫీ వర్క్స్ యజమాని శ్రీ బండి రామస్వామి రెడ్డి అనవసరంగా ఎక్సైజ్ కేసులో ఇరుక్కున్నారు. 15 తేది ఉదయం మద్రాసు నుంచి కారులో వస్తూ, మూడు టీచర్స్ స్కాచ్ సీసాలు తెచ్చు కొంటుండిగాదట. తడ చెక్ పోస్టులో ఎక్సైజ్ సిబ్బంది శ్రీ సి.హెచ్ వెంకటేశ్వర్లు వాటిని గమనించి పట్టుకొన్నారు. తప్పు చేసినప్పుడు అయ్యా, బాబు అని బ్రతిమలాడి వుంటే పరిస్థితి వేరుగా వుండేది. కాని ఆయన తొందరపడి సిబితో వాగ్వివాదానికి దిగాడట. మంత్రి రమేష్ రెడ్డి బంధువునని దబాయించ చూశారట. ఆ అధికారికి తిక్క రేగింది. అప్పటి కప్పుడే బలమైన కేసులో బిగించి, కోర్టుకు హాజరు పరచి, 15 రోజుల రిమాండ్‌కు పంపించారు.

### ఎవికె రాజీనామా

నెల్లూరు సాయిబాబా మందిరం నిర్వహణ సంఘం అధ్యక్షుడు శ్రీ ఎ.వి. కృష్ణా రెడ్డి తన పదవికి రాజీనామా చేశారు. మందిరానికి అత్యద్భుతమైన భవంతి, భక్తులకు సమస్తసౌకర్య గన్పదని సౌకర్యాలు కల్పించడంలో ఎవికె చేసిన కృషి ప్రశంస నీయమైనది. ఆ దేవాలయన్ని ఒక భూతల స్వర్గంగా మలచారాయన. ఆయన నిష్క్రమణ మందిర నిర్వహణకు పెద్ద కొరతగానే వుండ పోతుంది.

### పళ్ల చికిత్సకు పెద్ద డాక్టరు

పంటికి సంబంధించిన కొన్ని క్లిష్టమైన సమస్యలకు చికిత్స చేసేందుకు బృందా వనంలోని మధుర స్వీట్స్ ఎదురుగా డాక్టర్ వై.జి. రెడ్డి ఒక ఆస్పత్రి ప్రారంభించారు. ఎత్తు పళ్లు సరి చేయడం, క్లిప్పులు బిగించడం వంటి ఆధునిక శస్త్ర చికిత్సలు చేయడం వై.జి. రెడ్డి స్పెషాలిటీ. ఇప్పటి వరకు ఇటువంటి సమస్యలకు మద్రాసు డాక్టర్ల

కొరవ 8 పేజీలో





## శ్రద్ధాంజలి



శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి
(1923 - 1995)

పూజ్యులు, దైవభక్తి పరాయణులు, సనాతన ధర్మోద్ధారకులు అన్నదాత, మాకు ఆప్తులయిన

### శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి

గారి హఠాన్మరణం మమ్ములను దుఃఖ సాగరంలో ముంచివేసింది. వారి పవిత్ర ఆత్మకు శాంతి చేకూరాలని భగవంతుని ప్రార్థిస్తూ వారి కుటుంబ సభ్యులకు మా ప్రగాఢ సంతాపము తెలియజేయుచున్నాము.

| | | |
|---|---|---|
| ముండూరు శ్యామసుందర గుప్త<br>గుప్తా & బ్రదర్స్<br>స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు | B.L.N. స్వామి<br>S/o. బొమ్మిశెట్టి కాశీవిశ్వనాథమ్<br>కమీషన్ మర్చంట్,<br>స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు | బాబు కూల్‌డ్రింక్స్<br>సుబేదార్‌పేట రోడ్డు, నెల్లూరు |
| జిల్లా గోపినాధ్<br>హారికా అసోసియేట్స్<br>సిద్ధార్థ టవర్స్, నెల్లూరు | కె. మోహనరావు<br>సేల్ టాక్స్ ప్రాక్టీషనర్<br>ఉస్మాన్‌సాహెబ్‌పేట,నెల్లూరు | S. వెంకటేశ్వర్లు (కాశి)<br>C/o. బాబు కూల్‌డ్రింక్స్<br>సుబేదార్‌పేట, నెల్లూరు |
| టంగుటూరి నాగేశ్వరరావు<br>స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు. | Dr.B.Krishna Reddy,M.B.B.S<br>New Military Colony<br>A.K. Nagar, Nellore | సి. సత్యనారాయణగుప్తా<br>ముకుందపురం<br>నవాబుపేట రోడ్, నెల్లూరు |
| D.S. కుమార్<br>R.K. ఏజెన్సీస్,సంతపేట,నెల్లూరు | గుర్రం సుబ్రహ్మణ్యం, ఛైర్మన్<br>శ్రీ మల్లికార్జునస్వామి కామాక్షితాయి దేవస్థానం, జొన్నవాడ<br>ఉపాధ్యక్షులు, నెల్లూరు జిల్లా ఆర్యవైశ్య సంఘం, ఉస్మాన్‌సాహెబ్‌పేట, నెల్లూరు | |

విహాయ కామాన్ యస్సర్వాన్
పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మ మో నిరహంకారః
స శాన్తి మధిగచ్ఛతి

- భగవద్గీత

"ఎవడు సమస్తములైన కోరికలను
శబ్దాది విషయములను త్యజించి,
వానియందేమాత్రమూ ఆశలేక,
అహంకార మమకార వర్జితుడై ప్రవర్తించునో
అట్టివాడె శాంతిని పొందుచున్నాడు"



జననం 1923 మరణం 1995

# శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారు

## ఛేర్మన్ - ఇఫ్కో

వారు స్వర్గస్తులైనందుకు చింతిస్తూ, వారి ఆత్మకు సర్వేశ్వరుడు చిరశాంతి ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాము. భారతదేశాన్ని సస్యశ్యామలం చేసేందుకు వారు ప్రారంభించిన ఆదర్శ ప్రాయమైన కృషిని మనసా వాచా కొనసాగిస్తామని ప్రమాణం చేస్తున్నాము.

## వారి ఉత్తరక్రియలు

| | | |
|---|---|---|
| **7.11.1995** తేది | మంగళవారం | నిలుపు |
| **8.11.1995** తేది | బుధవారం | పందిరి |
| **9.11.1995** తేది | గురువారం | ఎత్తురేవు - బ్రాహ్మణబియ్యాలు |

నెల్లూరు జిల్లా కొడవలూరు మండలం రామన్నపాళెంలో జరుగుతాయి




**INDIAN FARMERS FERTILISER CO OPERATIVE LIMITED**

**NEW DELHI**

## ప్రకటన

నా కక్షిదారుడైన నూళ్లూరు పేట మండలం కుదిరి మజరా తిప్పకండ్రిగ కాపురస్థుడైన గురకల సుబ్బయ్య కుమారుడు గురకల రంగయ్య యావన్మందికి తెలియ జేయుట మేమనగా నా కక్షిదారుని పేరుతో వున్న విక్రయ పత్రముల తాలూకు కుదిరి నూళ్లూరు గ్రామములలోని భూములు తన స్వార్జితమని, సదరు ఆస్తుల పై నా కక్షి దారుడైన గురకల రంగయ్యకు తప్ప మరెవ్వరికీ ఏ విధమైన హక్కులు లేవని, నా కక్షి దారుని అన్న కుమారుడైన గురకల వజ్రమణి తనకు పై భూములలో హక్కులు గలవని సదరు భూములను విక్రయించ దలచి యున్నాడనియు అట్టి గురకల వజ్రమణి వద్ద ఎవ్వరు కొనుగోలు చేసినను అవి చెల్లవని. నా కక్షి దారుడు గురకల రంగయ్య తీసికొను సివిల్ క్రిమినల్ చర్యలకు బద్ధులై యుండ గల వారని యిందు మూలముగా తెలుపడ మైయున్నది.

**బద్దెపూడి వేణుగోపాలరెడ్డి**
అడ్వకేటు, నూళ్లూరుపేట

## ప్రకటన

ఇందు మూలముగా యావన్మందికి తెలియ జేయుట మేమనగా ఈ దిగువ కనపరచిన మర్రిపాడు మండలం, కంప సముద్రం గ్రామ సర్వే నంబర్లలోని య 30.55 ట్లు మెట్ట మరియు మాగాణి భూములు మరియు నివాస గృహములు, పశువుల కొట్టములు వగైరాలు యం.వి. నారాయణ రెడ్డి మరియు అతని సోదరుడు వెంకట రమణా రెడ్డి గారల యొక్క జాయింటు కుటుంబ ఆస్తియై వుండినది. వారిరువురికి సదరు ఆస్తులలో సమాన భాగములు కలవు. మల్లు వెంకట రమణా రెడ్డి ఏ విధమైన వ్రాతలు వ్రాయకనే కాలము చేసినారు. తరువాత ఆయన భార్య కమలమ్మ వారస త్వా దిగువ స్థలంలో తనకు సంక్రమించిన ఉమ్మడి వాటాను రిజిష్టరు వీలునామా 20.11.92 తేది ద్వారా నా కక్షిదారు రాలైన శ్రీమతి సద్దా శారదమ్మకు చెంద జేసియున్నది. నా కక్షిదారులు యొక్క సోదరులు మల్లు సుధాకర రెడ్డి, ఉమా మహేశ్వర రెడ్డి మరియు వీన తండ్రి M.V. నారాయణ రెడ్డి, ఈ దిగువ కనపరచిన స.నెం.లలోని ఆస్తులను అన్యాక్రాంతములు చేయుటకు ప్రయత్నించు చున్నారని తెలియు చున్నది. అట్లు చేయుటకు వారికి హక్కు లేదు. సదరు ఆస్తులను ఎవరైనను కొన్న యెడల అట్టి విక్రయములు మా కక్షిదారు దారులను బద్ధకించవు మరియు అట్టి విక్రయములు చెల్లనేరవు. మా కక్షిదారులు సదరు ఆస్తులలో తన భాగమును పంచి స్వాధీన పరచుటకు కోర్టు ద్వారా తగు చర్యలు తీసికొన బోవుచున్నది.

స.నెం. 273, 275, 270/1, 270/3, 252/1, 138/1, 138/2, 223/2, 232, 245, 246, 231, 230/1, 230/2, 234, 151/1, 149, 253/1, 253/2, 249, 202/3, 198, 218, 318, 319, 320, 325/2, 325/3, 328, 327/1, 327/2, 331, 332/1, 334, 335, 336 మొదలగునవి.

**ఎస్. శ్రీనివాసులు రెడ్డి**
అడ్వకేటు, గాంధీనగర్, నెల్లూరు.

## అమెరికన్ ఆస్పత్రి

మొదటి పేజీ కొరవ

విభాగంలో పని కల్పించారు. నార్వేలో డాక్టర్ పూలకు ఒక చర్చి ఫాదర్ ఇంట్లో ఆమె పరిచయమైందట. తాను ఇండియా గురించి చాలా పుస్తకాలు చదివానని, ఆ దేశం చూడాలని వుందని, అందువల్ల వాలంటీర్‌గా వచ్చి పని చేస్తానని చెప్పిందట. తానక్కడ జర్నలిస్టుగా కూడా పని చేస్తున్నట్లు తెల్పిందట. ఇది జరిగింది గత ఏడాది జూలైలో; నార్వేలో జరిగిన ఇంటర్నేషనల్ క్రిస్టియన్ మెడికల్ అండ్ డెంటల్ డాక్టర్స్ అసోసియేషన్ సమావేశంలో పాల్గొన డానికి డాక్టర్ పూలా అప్పుడక్కడకు వెళ్లి వుండినారు. ఆ అమ్మాయి తల్లి నార్వేలో లైబ్రేరియన్; తండ్రి ఒక చర్చిలో ఫాదర్.

ఈ మధ్య కాలంలో ఆమె డాక్టర్ పూలాకు నాలుగు జాబులు వ్రాసింది. అందులో ఒక దానిలో, ఆమె తాను ఇండియాకు ఒంటరిగా వస్తే [illegible] పాకకు గురయ్యే ప్రమాదం వుందని కాబట్టి లండన్‌లో వున్న ఇండియన్ సంబంధాలు కల్గిన అర్చన అనే తన స్నేహితురాలిని తీసుకొని వస్తానని వ్రాసి వుంది. ఇట్లా ఉత్తరాలు నడిచిన తర్వాత ఆమె 1 తేది నెల్లూరు వచ్చారు. డాక్టర్ బేర్ ఇది వరకు నివసించిన బంగళాలో ఆమెకు వసతి కల్పించారు. ఆ భవంతి ఆస్పత్రి ఆవరణంలోనే వుంది. ఈ సంఘటన జరిగిన రోజు రాత్రి అదే భవంతిలో, ఆమె గది ప్రక్కన రాయవెల్లూరు నుంచి వచ్చిన సీనియర్ డాక్టర్ శ్రీ ఎల్‌బిఎం జోసఫ్ కూడా బస చేసి వున్నాడట. ఆయన వయస్సు 82 సంవత్సరాలు; సిఎంసి ఆస్పత్రి రిటైర్డ్ డైరక్టరు; చాలా గౌరవ నీయుడు, పెద్దమనిషి. అక్కడకు రెండు వందల గజాల దూరంలో వున్న డాక్టర్ పూల ఇల్లు, భవంతి ఆస్పత్రిలోని వారికి కన్పిస్తూ వుంటాయి. అక్కడ నిలబడి పెద్దగా మాట్లాడితే ఆస్పత్రిలోని రోగులకు విన్పిస్తుంది. అదేమీ నిర్మానుష్య, ఏకాంత ప్రదేశం కాదు. ఆమె గదిలో టెలిఫోన్, ఇంటర్ కం ఫోన్ వున్నాయి.

ఆమె నెల్లూరుకు వచ్చిన వారం రోజులు బాగానే వుండింది. తనకు కంప్యూటర్లు తెలుసునని, అందువల్ల ఆస్పత్రిలోని సిబ్బందికి కంప్యూటర్లలో శిక్షణ ఇచ్చే పని అప్ప చెప్పమని అడిగిందట. ఆ ప్రకారం ఆమె ఒక టైమ్ టేబుల్ తయారు చేసి కొందరికి శిక్షణ ఇచ్చింది. 11 తేది రాత్రి వరకు అంతా బాగానే నడిచింది. 12 తేది రాత్రి 7 గంటల సమయంలో మంత్రి శ్రీ టి. రమేష్ రెడ్డి రాక సందర్భంగా రైల్వే స్టేషన్ దగ్గర బొట్లు పేల్చడంతో పెద్ద పెద్ద శబ్దాలు వచ్చాయి. ఆ సమయంలో ఇంట్లో ఒంటరిగా వున్న నార్వే యువతి ఉలిక్కి పడి, భయంగా ఆస్పత్రి దగ్గరకు వచ్చిందట. రమేష్ రెడ్డి వూరేగింపుకు వచ్చిన జనంలో రెండు మూడు వందల మంది ఆస్పత్రి ఆవరణంలోకి పరుగెత్తి వచ్చారట. బొట్ల శబ్దం, ఇంత మంది జనం పరుగులు పెడుతూ రావడంతో ఆమె హడలి పోయింది. కొందరు నర్సులు ఆమెకు ధైర్యం చెప్పారు. ఆ తర్వాత కొద్ది సేపటికి ఆమె పెద్దగా కేకలు వేయడం మొదలు పెట్టిందట. ఎంత వారించినా విన్పించు కున్నట్లు లేదు. తర్వాత డాక్టర్ పూల ఇంటికి వెళ్లి, ఆయన శ్రీమతి డాక్టర్ లలితతో మాట్లాడిందట. అప్పటికే ఆమెలో చాలా మార్పు వచ్చినట్లుంది. డాక్టర్ లలిత - ఆ అమ్మాయిని కొందరు నర్సులకు అప్పచెప్పారట. బృంద, ప్రియ అనే నర్సులిద్దరు, సిస్టర్ ఫ్లోరా అనే సీనియర్ సిస్టర్ ఆ రాత్రి ఆమెకు తోడుగా ఆమె గదిలోనే పడుకున్నారట. రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో ఆమె మరొక సారి పిచ్చిగా ప్రవర్తించింది. తెల్లవార్లూ నలుగురు నర్సులు, ఒక వాచ్‌మెన్ ఆమె వెంట వుండి, కాపాడారు.

తెల్లవారి ఆరు గంటలకు డాక్టర్ పూల, సిఎంసి డాక్టర్ శ్రీ జోసఫ్ కలెక్టర్ గారిని కలిసి పరిస్థితి చెప్పారు. ఇటీవలే కాశ్మీర్‌లో తీవ్రవాదులు ఒక నార్వే దేశస్తుణ్ని చంపి వేయడంతో, అదే దేశానికి చెందిన ఈమె కేదైనా జరిగితే అది దేశాల మధ్య సమస్యగా మారుతుందన్న భయంతో డాక్టర్ పూల ముందుగా కలెక్టర్‌కు చెప్పారు. ఆయన ఎస్‌పిని కలవ మన్నారట. వారు 13 తేది ఉదయం కలెక్టర్ బంగళా నుంచి తిరిగి వచ్చేసరికి ఆమె పిచ్చి కేకలు పెడుతూ, వాచ్‌మెన్‌లను త్రోసివేసి, గేటు దూకి, రోడ్డులోకి వచ్చేసింది. ఈ ఘర్షణలో గేటు తగిలి ఆమె వంటికి గాయాలైనాయి. ఆ సాయంత్రం వరకు ఆమె పోలీసుకు, ఆస్పత్రి సిబ్బందికి అలివి కాలేదు. రోడ్లో నానా బీభత్సం సృష్టించింది. డాక్టర్ పూల ఆమెను స్థానిక మానసిక వైద్యుడికి చూపించారు. ఆయన - ఆమె హిస్టీరియా వ్యాధికి లోనైనట్లు నిర్ధారించారు. ఎస్‌పి సమక్షంలో సైతం ఆమె పిచ్చిగా ప్రవర్తించింది. తర్వాత పోలీసు సహాయంతో ఆమెను మద్రాసులోని అమెరికన్ కాన్సులేట్ కార్యాలయానికి అప్పచెప్పారు. ఇప్పుడొక మానసిక వైద్యుడి పర్యవేక్షణలో క్షేమంగా వుందా యువతి. ఇదీ జరిగింది.

ఆ యువతి పై ఆస్పత్రిలో ఎవరూ అత్యాచార యత్నం చేయడం కాని, చిత్ర హింసలు పెట్టడం కాని జరగలేదు. అట్లా జరిగిందని ఎవరూ ఫిర్యాదు చేయలేదు. అమెరికన్ దౌత్య అధికారులతో కూడా ఆమె ఆ ఫిర్యాదు చేయలేదు. నార్వేలోని ఆమె మామతో ఆమె చేత ఫోన్‌లో మాట్లాడించిన సందర్భంలోనూ ఆమె ఆ విషయం చెప్పలేదు. డాక్టర్ల పరీక్షలో ఆమెకు కన్నెపొర చిరగలేదని, ఆమె పై ఎటు వంటి లైంగిక అత్యాచారం జరగ లేదని నిర్ధారణ అయ్యింది. ఆమె తల్లిదండ్రులు ఇప్పుడు ఉక్రెయిన్ దేశంలో విహార యాత్రకు వెళ్లి వున్నారట. వారిని ఇండియాకు పిలిపించే ప్రయత్నం జరుగు తూంది.

ఈ సంఘటనను స్థానిక దళిత సంఘాలు, మహిళా సంఘాలు పెద్ద సమస్యగా చిత్రించి రచ్చ చేస్తున్నాయి. డాక్టర్ పూలాను అరెస్టు చేయాలని వీరు అలజడి సృష్టిస్తున్నారు. ధర్నాలు, ఘెరావ్‌లు చేస్తున్నారు; వూరేగింపులు నిర్వహిస్తున్నారు. అధికార్లను శాపనార్థాలు పెడుతున్నారు. ఇతరులనూ నోటికొచ్చినట్లు తిడ్తున్నారు. ఆందోళన చేసే వారందరికి ఆ యువతి పై అత్యాచారం జరగ లేదని తెలుసు. అమెరికన్ దౌత్యాధి కారులు సైతం వారికి ఇటువంటి అనుమానాస్పద సమాచారం అందివ్వలేదు. అయినా ఆందోళన జరుగుతున్న దంటే అందుకు కారణం - ఆస్పత్రిలోను, చర్చిలోను వుండే అంతర్గత రాజకీయాలు, అసూయలు.

ఎస్‌టిబిసి అనే క్రిస్టియన్ సంస్థ ఒకటి వుంది. దానికి కోట్ల రూపాయల విదేశీ నిధులు వస్తుంటాయి. దేవదానం అనే క్రిస్టియన్ నాయకు డొకరు వాటిని గుట్టు చప్పుడు కాకుండా స్వాహా చేస్తుంటారు. ఎబిఎం హై స్కూలు ఆస్తులనూ ఆయన అక్రమంగా అమ్మి, సొమ్ము చేసుకున్నారని ఆరోపణ వుంది. వీటిని డాక్టర్ పూల ప్రతి ఘటిస్తున్నారు. ఇద్దరి మధ్య ఘర్షణ లున్నాయి.

డాక్టర్ మాలతి అనే ఒక సీనియర్ డాక్టర్ వున్నారు. బేర్ నిష్క్రమణ సమయంలో, ఆమెను కాదని డాక్టర్ పూలకు ఆస్పత్రిని అప్పచెప్పి వెళ్లారు. ఇది ఆమెకు అసూయ.

ఆస్పత్రిలో అంతర్గతంగా హరిజన, అరుంధతీయ వర్గాలున్నాయి. వారిలో ఒకరంటే ఒకరికి పడదు.

వీరందరూ కలిసి దళిత, మహిళా సంఘాలకు పెట్టుబడి పెట్టి, గలభా చేయిస్తున్నా రన్నది అసలు నిజం. దేవదానం గారు ఇప్పటికే ఆందోళన కోసం, జన సమీకరణ కోసం లక్ష రూపాయలు పైగా ఖర్చు చేశారట. దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు - ఏమి జరుగు తున్నదనే విషయం.

నిజంగా ఆ యువతి పై అత్యాచారం జరిగి వుంటే దోషులను కఠినంగా శిక్షించాల్సిందే. కాని జరగని సంఘటనను జరిగినట్లు దుష్ప్రచారం చేసి గలభా సృష్టించడ మేమిటి? నిజం నిర్ధారించు కోకుండా, వాస్తవాలు తెలుసు కోకుండా అలజడి చేయడ మేమిటి? దళిత సంఘాలు, మహిళా సంఘాలు తమకున్న మూక బలంతో తమకు గిట్టని వారిని బ్లాక్ మెయిల్ చేసే స్థితికి దిగ జారితే సమాజంలో ఎవరైనా గౌరవంగా బ్రతికేదెట్లా? ఈ ధోరణులను ప్రోత్సహిస్తే ఎంతటి అరాచకానికి దారి తీస్తుందో ఎవరైనా గ్రహిస్తున్నారా?

## జనవాణి

3 పేజీ కొరవ

పోలింగ్ కేంద్రానికి రమ్మని ఓటర్ల లిస్టు ప్రకారం నెంబరు వేసి ఓటర్ల ఇంటి వద్ద కొచ్చి ఒక నోటీసు ఇచ్చారు. ఈ నోటీసులోని నెంబరు ఫోటోలు తీసే సిబ్బంది దగ్గరున్న ఓటర్ల లిస్టుతో సరిపోలేదు. అందువల్ల అనవసర వెతుకులాటతో వున్న కొద్ది గంటలు గడిచి పోయాయి. ఆర్డీఓ గారు ఈ రకమైన రెవిన్యూ విధులకు కొత్త అధికారులను నమ్మి సరియైన అజమాయిషీ చేయక పోవడం వల్ల, ఉపాధ్యాయులను వదలి కాకుండా ఇతర సిబ్బందిని నియమించడంతో టౌన్‌లో ఫోటోల కార్యక్రమం గబ్బు పట్టి పోయింది.

నెల్లూరు -గ్రిద్దలూరు గోపాలరావు

## జిల్లావార్తలు

10 పేజీ కొరవ

దేవస్థానానికి వెళ్లే రోడ్డు సక్రమంగా లేక పోవడంతో 2 లక్షలు ఖర్చు పెట్టి తారు రోడ్డు వేయించామని అద్దాల మండపానికి 5 లక్షలు, నిత్యాన్నదాన పథకానికి గ్యాస్ సరఫరా ఏర్పాట్లకు 30 వేలు, దేవస్థాన గాలి గోపురానికి ఎనామిల్ పెయింటింగ్ 80 వేలు ఖర్చు పెట్టామని చెప్పారు. కంచి కామకోటి పీఠాధి పతుల వారిచే సమర్పించ బడిన చక్రయంత్ర సంప్రోక్షణకు, శ్రీ [illegible] యంత్ర ప్రతిష్ఠకు 80 వేల రూపాయలను అక్టోబర్ 15 తేది ఖర్చు పెట్టి కార్యక్రమాన్ని ఘనంగా జరిపించారు. పెన్నానది రేవును దృఢ పరిచేందుకు ఇరిగేషన్ శాఖ ద్వారా 50 వేల రూపాయలు కూడా మంజూరయ్యాయి. 15 తేదితో పాలన ముగిసిన గుర్రం సుబ్రహ్మణ్యం అధ్యక్షతన నడిచిన నగర పాలక వర్గం 6,22,546 రూపాయల నిధి నిత్య అన్నదాన పథకానికి పలువురు దాతల దగ్గర స్వీకరించి డిపాజిట్ చేసి పెట్టారట. తమ పరిపాలనలో దేవస్థానం అభివృద్ధికి పాటుపడ్డ పాలక వర్గాన్ని కామాక్షమ్మ మళ్లీ కరుణించక పోతుందా?

## పెళ్ళకూరు

4 పేజీ కొరవ

దేశంలో ప్రకృతి సిద్ధమైన మందులు తయారు చేసే పెద్ద కంపెనీ. గర్భవీధిలో ఏళ్ల తరబడి సాంప్రదాయ బద్ధమైన యునాని వైద్యం అందిస్తున్న డాక్టర్ ఖాన్ బాషా, పాత తరం యునాని వైద్యుడు డాక్టర్ మస్లుద్దీన్ అల్లుడు.

## నెల్లూరుముచ్చట్లు

5 పేజీ కొరవ

పై ఆధార పడవలసి వచ్చేది. డాక్టర్ వై.జి. రెడ్డి వయస్సులో చిన్న వాడే కాని, చదివిన చదువు పెద్దది. నార్తుమోపూరు సర్పంచ్ శ్రీ యరబోలు హరిప్రసాద్ రెడ్డి కుమారుడు; డాక్టర్ వైఎస్ రెడ్డి సోదరుని కుమారుడు. ఆయనకు మా శుభాకాంక్షలు.

### డాక్టర్ అనిల్ విదేశీయానం

నెల్లూరు చక్కెర వ్యాధి నిపుణుడు డాక్టర్ ఐ. అనిల్ కుమార్ రెడ్డి ఫిన్‌ల్యాండ్, స్విట్జర్లాండ్, స్వీడన్ దేశాలలో ఆధునిక శిక్షణ పొంది ఇటీవలే స్వదేశానికి తిరిగి వచ్చారు. స్టాక్ హోంలో ఒక పెద్ద సదస్సులో ప్రసంగించారు. అంతర్జాతీయ స్థాయి మధుమేహ వ్యాధి నివారణ ప్రక్రియలు, మెళకువలు చాలా నేర్చుకొని వచ్చారు; వివరాలు పై వారం.

## పంచాంగం

### గ్రహణము

24 తేది మంగళ వారం ఉదయం 7.21 నుండి 10.30 గంటల వరకు సంపూర్ణ సూర్య గ్రహణం.

### అక్టోబరు తిథులు

ఆశ్వయుజ బహుళ

తే 21 శని ద్వాదశి ప.గ. 12.06 వ
తే 22 ఆది త్రయోదశి ప.గ. 11.58 వ
తే 23 సోమ చతుర్దశి ప.గ. 11.20 వ
తే 24 మంగళ అమావాస్య ప.గ. 10.17 వ

కార్తీకశుద్ధ

తే 25 బుధ పాడ్యమి ఉ.గ. 8.18 వ
తే 26 గురు విదియ ఉ.గ. 6.58 వ
తదుపరి తదియ పూర్తిగ
తే 27 శుక్ర చతుర్థి రా.గ. 2.50 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

# "నన్ను నీతో లాక్కోవే అక్కా" - నగ్మా చెల్లెలు కోరిక

నగ్మా అసలు పేరు నందిత. చెల్లెల్ల పేరు రాధిక, జ్యోతిక. జ్యోతిక కంప్యూటర్ ఇంజనీరింగ్ అభ్యసిస్తోంది. తమ సినిమాలకు అమిత దూరమట. రాధికకు పై చదువుల పట్ల అట్టే ఆసక్తి లేదట. "నన్ను కూడా సినిమా లోకంలోకి లాక్కోవే అక్కయ్యా" అంటుందట. దక్షిణ భారత చిత్రాలలోనే ప్రయత్నించాలి. ముందు తెలుగులోనే, తమిళంలోనే రాణించాక హిందీ చిత్రాల గురించి ఆలోచించ వచ్చు" అంటుంది నగ్మా.

## దాసరి న్యూస్

అక్టోబర్ చివరి వారంలో "ఒరేయ్ రిక్షా" విడుదల చేసిన తర్వాత దాసరి మూడు కొత్త చిత్రాలు ప్రారంభిస్తారట. మోహన్ బాబుతో తీసే చిత్రం "క్షత్రియ వంశం"; నలుగురు కొడుకులు, నలుగురు కోడళ్ళు, ఎనిమిది మంది మనమలు, ఎనిమిది మంది మనవరాళ్ళ పాత్రలతో "నాయుడమ్మ కుటుంబం" ప్రారంభిస్తారట. అవి కాక అందరు కొత్త నటీనటులతో ఒక చిత్రాన్ని తెలుగు, తమిళం, హిందీ భాషల్లో తీస్తారట.



వజ్రం చిత్రంలో నాగార్జున, రోజా

# కమలహాసన్‌ను పీడిస్తున్న సైతాన్

"ప్యాసా సైతాన్" అనే భయానక హిందీ చిత్రంలో కమల హాసన్ 14 ఏళ్ల క్రితం చీకటి రేడుగా నటించాడు. కొన్ని సన్నివేశాలలో కమల్ ముఖం "డ్రాకులా" లా భయంకరంగా మారుతుంది. ఎంచేతో ఆ చిత్రం ఇంత వరకు విడుదలవ లేదు. ఈలోగా కమల్ ఎంతో ఎదిగి పోయాడు. ఇటీవల ఆ చిత్రాన్ని విడుదల చేయ బోతున్నట్లు దర్శక నిర్మాత జోగిందర్ ప్రకటించాడు. అది చూసి కమల్ విభ్రాంతు డయ్యాడు. ఇప్పుడు విడుదలైతే అతని ఇమేజ్ దెబ్బ తింటుంది. అంచేత ఆ చిత్రం విడుదలవ కుండా కోర్టు ద్వారా చర్య తీసుకోవడానికి ప్రయత్నించాడు. కాని, అతని వాదన నెగ్గలేదు. జోగిందర్ విడుదలకు సన్నాహాలు చేస్తున్నాడు. కమల్‌కు దిక్కు తోచకుండా ఉంది.

## మద్రాసు సినిమా వార్తలు

### "అన్నా మజాకా"

"ఆలయ ఆస్తిపాస్తులను కొల్లగొట్టే ఒక అరాచక వర్గాన్ని హీరో ఎలా ఎదుర్కొంటాడనేది ప్రధాన ఇతివృత్తం" అన్నారు డైరక్టర్ విజయ్ కుమార్.

# "నేనూ బొంబాయి దిగుమతితారనే" -రాధ జాణతనం

"పాపను ఎల్.కె.జి.లో చేర్పి వయసొచ్చేసింది. ఇక పాప స్కూలుకు వెళ్తె ఇంట్లో నాకేమీ తోచదు కదా! అందుకే మళ్ళీ సినిమాలలో కొంత కాలం పాటు నటించాలను కుంటున్నాను అంది రాధ. పునః ప్రవేశానికి సాధారణంగా అందరూ చెప్పే కారణమే ఇది".

"తెలుగు నిర్మాతలకు గాని, తమిళ నిర్మాతలకు గాని ఇటీవల బొంబాయి నుంచి దిగుమతి చేసుకొనే హీరోయిన్ల మీదే మోజు. ఇప్పుడు ట్రెండ్ మారిందా" అంటే

"ఇప్పుడు నేను కూడా బొంబాయి నుంచి వచ్చిన తారనేగా?" అంది రాధ నవ్వుతూ. "కొద్ది రోజులు ప్రయత్నిస్తాను. మంచి ఛాన్సు వస్తె చూస్తాను. లేకపోతే బొంబాయికే ఎగిరి వెళ్ళి పోతా" అందామె.

రాధలో అట్టే మార్పు లేదు. వొళ్లు చేయలేదు. ఎప్పటిలాగే నవ్వుతూ మాట్లాడు తోంది. కళ్ళు ప్రకాశ వంతంగానే ఉన్నాయి. కాని, ఇటీవల ట్రెండ్ మారింది. మునుపు ఆమె సరసన నటించే హీరోలే ఇప్పుడు ఆమె సరసన నటించడానికి ఒప్పుకోక పోవచ్చు.

## దివ్యవాణి వివాహం

నటి దివ్యవాణికి వి.ఎస్. సుబ్రహ్మణ్యం అనే వ్యక్తితో 6 తేది శుక్రవారం ఉదయం 9.30 గంటలకు పామ్‌గ్రోవ్ హోటల్లో వివాహం జరిగింది.

# "చిరంజీవి ధరకు నాలుగు చిత్రాలు తీసుకొంటాం మేము"

చిరంజీవి నటించిన "హాయ్ సుందరి! మెకానిక్ అల్లుడు" అనే మలయాళంలోకి డబ్ చేయబడిన చిత్రాలు 125 రోజులు దాటి ప్రదర్శింప బడుతున్నాయి. బిగ్‌బాస్ రజతోత్సవం చేసుకో బోతుంది. కారణాలు ఆరా తీస్తే, కేరళలో తయారయ్యే మలయాళ చిత్రాలలో అంత భారీ తనం కానరాదట" చిరంజీవికి అంత డిమాండ్ ఉన్నప్పుడు అతనితోనే మలయాళంలో స్ట్రెయిట్ చిత్రాలు తీయెచ్చుగా" అని అడిగితే నటి సుకన్య. మంచిదే. కాని ఆయన తీసుకునే పారితోషికంతో నాలుగైదు మలయాళ చిత్రాలు తయారవు తాయి" అంది నవ్వుతూ

## పోలీస్ ఆఫీసర్‌కు మోహన్ బాబు బెదిరింపు

మోహన్ బాబు తెలుగు దేశం పార్టీకి చెందిన రాజ్యసభ సభ్యుడై నప్పట్నుంచి ఆయనలో అహం అప్పుడప్పుడు విజృంభిస్తూ వుంది. హైదరాబాద్ జూబిలీ హిల్స్‌లో డి.ఎస్.పి. దామోదర రెడ్డి గృహంలో డైరక్టర్ దాసరి నారాయణ రావు అద్దెకు వుంటున్నారు. దాసరికి, డి.ఎస్.పి.కి తగాదా లున్నాయి. దాసరి కోరగా మోహన్ బాబు జోక్యం చేసుకున్నాడు. డి.ఎస్.పి.ని ఎదిరించి, ఆయన గన్‌మెన్ వద్ద ఉన్న గన్ లాక్కొని ఆయన్నే బెదిరించాడట మోహన్ బాబు. ఎంత ఎమ్పీ అయినా పోలీస్ ఉన్నతోద్యోగితో పెట్టుకోవడం మంచిది కాదని మోహన్ బాబు ఎప్పటికి గ్రహిస్తాడో! అతను చేసే తొందరపాటు పనుల వల్ల దుష్ఫలితాలు కల్గకుండా మిత్రుడైన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఎంతని ఆదుకో గలడు? మొత్తం మీద పోలీసు శాఖ వారు మోహన్ బాబు మీద ఆగ్రహంగా వున్నారట.

## ఇతర భాషలలో మన నటులు

కన్నడ హీరో రవిచంద్రన్ నిర్మించే "సిపాయి" కన్నడ చిత్రంలో చిరంజీవి ఒక గౌరవ పాత్రను ధరించాడు. "సర్కిల్ ఇన్స్‌పెక్టరు" అనే కన్నడ చిత్రంలో బాబూ మోహన్ పోలీస్ కానిస్టేబిల్‌గా నటించాడు. హీరో రాజేంద్ర ప్రసాద్ త్వరలో తమిళ, మలయాళ చిత్రాలలో నటించ బోతున్నట్లు ప్రకటించాడు. తమిళ, కన్నడ హీరోలు మన తెలుగు చిత్రాల్లో నటిస్తున్నప్పుడు ఆయా భాషా చిత్రాలలో మేం నటిస్తె మాత్రం తప్పేమిటి అంటున్నాడు రాజేంద్ర ప్రసాద్.

## శ్రీకారం"

జగపతి బాబు చాముండి చిత్ర నిర్మించే చిత్రం 'శ్రీకారం'. దర్శకత్వం: సి. ఉమా మహేశ్వర రావు.

అర్ధనగ్న దృశ్యాలు, అంగాంగాల ప్రదర్శన తప్ప మరేదీలేదు

# ముద్దాయి ముద్దుగుమ్మ

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

శోభ అనే అమ్మాయి ఒక రాత్రి ఒక హోటల్ పై అంతస్తు నుంచి క్రింద పడి చనిపోతుంది. ఇది ఆత్మహత్య అన్నారు. కాదు కాదు హత్య అన్నారు.

శోభ, హోటల్లో సంగీత కార్యక్రమాల్లో కీబోర్డు ప్లేయరుగా పనిచేస్తున్న విక్కీని (సుమన్) ప్రేమిస్తుంది. విక్కీ ఆమెను ప్రేమించడు. వీరిద్దరి మధ్య ఏవో గొడవలు జరిగి విక్కీ, శోభను చంపేసినట్టు భావిస్తారు. ముద్దాయిగా నిర్ణయిస్తారు. కాని హత్య చేసినట్టు ఆధారాలు చిక్కనందున పోలీసులు విక్కీని అరెస్టు చెయ్యరు. విక్కీ, విజయ్‌గా పేరు మార్చుకొని శోభను చంపిన నేరస్తుణ్ణి పట్టు కోవాలను కుంటాడు. రోజా (రమ్యకృష్ణ) ప్రేమలో పడతాడు. ఈ రోజా ఎవరో కాదు - శోభ అక్కయ్యే. శోభను చంపినట్టుగా అనుమానింప బడే విక్కీని ఎలాగైనా బంధించాలని రోజా విక్కీ కోసం వెతుకు తుంటుంది. తాను ప్రేమించిన విజయ్ ఆ విక్కీయేనని రోజాకు తెలియదు. విజయ్ తన మారు రూపాన్ని జాగ్రత్తగా కాపాడు కుంటూ వస్తాడు. రోజాను పెళ్ళి చేసుకోవాలను కుంటాడు. ఈ ప్రయత్నంలో రాజా (శరత్ బాబు) అనే పెద్ద వ్యక్తిని ప్రాధేయపడి, అతడ్ని తన బాబాయిగా వ్యవహరించి రోజాతో తన పెళ్ళి జరిపించమని వేడుకుంటాడు. అందుకు రాజా అంగీకరించి విజయ్, రోజాల వివాహం నిశ్చయిస్తాడు.

ఇది ఇలా వుండగా ఒక క్లబ్ డాన్సర్ (సిల్క్‌స్మిత) విజయ్‌ను ప్రేమిస్తుంది. అసలు రహస్యం తెలుసు కుంటుంది. విజయ్‌ను విక్కీగా గుర్తించి ఆ విషయం రోజాకు తెలియ పరుస్తుంది. విక్కీ మీద క్రోధంగా వున్న రోజా, విక్కీ రూపాంతరంలో వున్న విజయ్‌ను దూషిస్తుంది; పెళ్ళి ఆగిపోతుంది. తాను నిర్దోషినని రుజువు చేసు కునేందుకు విజయ్ తీవ్రంగా ప్రయత్నిస్తాడు అసలు హంతకుణ్ణి పట్టుకుంటాడు. ఎంతో పెద్ద మనిషిగా వున్న రాజా నేరస్తుడని తెలుస్తుంది.

నేరం, పరిశోధనతో కూడుకున్న ఈ కథను దర్శకుడు ఎస్.పి. రాజారాం ఒక మామూలు చిత్రంగా రూపొందించాడే కాని, సస్పెన్స్, థ్రిల్ తీసుక రాలేక పోయాడు. హీరో విక్కీకి ముగ్గురు స్త్రీలతో సంబంధాలు పెట్టి నాట్యాల ద్వారా శృంగారం బాగా చూపించాడు. రమ్యకృష్ణ పాత్ర, క్లబ్ డాన్సరుగా సిల్కుస్మిత ప్రత్యేక ఆకర్షణలతో డాన్సులు చేయించాడు దర్శకుడు. చిత్రమంతా వ్యాపార ధోరణిలో సాగిందే కాని, నేర పరిశోధనల తీరు, జోరు కనిపించ లేదు. అన్ని తెలుగు చిత్రాల్లో వలె అర్ధనగ్న చిందులు ఇందులోనూ వున్నా చిత్రం రాణించ లేక పోయింది.

సుమన్ ఫైట్లు, నృత్యాలు బాగా చేశాడు. ఈనాటి సినిమా హీరోలకు ఇవే కదా ముఖ్యం? రమ్యకృష్ణ చిందులకే పరిమితమై పోయింది. శరత్ బాబు తన పాత్రను చక్కగా పోషించాడు. చరణ్ రాజ్, బాలయ్య, బాబూ మోహన్, సిల్క్‌స్మిత పాత్రలు మామూలుగానే వున్నాయి. వారూ మామూలుగానే నటించారు. డిస్కో శాంతికి అసలు ఒంటి మీద గుడ్డ వుందా?

సాయినాథ్ సంభాషణలు చిత్రాన్ని చచ్చు దేల్చడంలో తమ వంతును పంచు కున్నాయి. బప్పీలహరి సంగీతంలో పాటలు బాగున్నాయి. సుమన్, రమ్యకృష్ణలతో నృత్యం చేస్తూ పాడిన "గురూ, గురూ ప్రేమించు కుందాం పద చూపెయ్" పాట హుషారు గొలుపు తుంది. ఉత్తమ కొరియో గ్రాఫర్‌గా జాతీయ అవార్డు పొందిన హిందీ నృత్య దర్శకుడు జయబోరాడే ఈ పాటకు నృత్యం కూర్చాడు. బాగుంది.

నందియాద్రి కెమరాకు ఫైట్లను, డాన్సులను నాణ్యంగా చూపింది. ఈ కెమరా సిల్కుస్మిత, డిస్కో శాంతిల అంగాంగాల మీద మోజు ఎక్కువగా వున్నట్లుంది.

# "ఎన్టీఆర్ రెండవ పెళ్లి మా బోటి వారికి శాపమైంది"

జిల్లాకు చెందిన ఇద్దరు మంత్రులు రమేష్ రెడ్డి, బల్లి దుర్గా ప్రసాద్‌లను గూడూరులో 15 తేది ఘనంగా సన్మానించారు. సత్కార సభకు ఏర్పాట్లు చేయడంలో తెలుగు యువత నాయకులు చేవూరు విజయ మోహన రెడ్డి, వేమారెడ్డి రామచంద్రా రెడ్డి కిష్కూరు గోసూరు శ్రీనివాసులు రెడ్డి పోటీలు పడ్డారు. వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గారు మంత్రుల మెప్పు పొందడానికి నానా శ్రమ పడ్డారు; ఉదయం నుంచి సాయంత్రం వరకు గెస్ట్ హౌస్‌లోనే తిష్ట వేసి ఏర్పాట్లు పర్యవేక్షించారు. పోమిరెడ్డి చంద్రమోహన రెడ్డికి స్వాగతం చెప్పే బ్యానర్లు టౌన్‌లో అక్కడక్కడా వుండి తన పేరు ఎక్కడా కనపడక పోయేసరికి దేగా నారసింహా రెడ్డి స్థానిక నాయకుల మీద చిర్రు బుర్రు లాడడం కన్పించింది. శాసన సభ్యులంతా గూడూరు వస్తారని ఊదర గొట్టి ప్రచారం చేసినా ముగ్గురు ఎమ్మెల్యేలు మాత్రమే హాజరయ్యారు.

రమేష్ రెడ్డి గారికి ఆవేశం తన్నుక వచ్చి నట్లుంది. చాలా పరుషంగా పరిధులు దాటి మాట్లాడేశారు. నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి లక్ష్మి పార్వతిని కోటకు పిలుచుకొని వచ్చి సమర శంఖం పూరించ మన్నారు. ఎవరి మీద సమర శంఖం? ఆ సభే పార్టీ చీలికకు కారణ మయ్యింది. పెద్దాయన చంద్రశేఖర్ రెడ్డి లక్ష్మిపార్వతిని జయలలితతో పోల్చడ మంటే ఎన్టీఆర్ చనిపోవాలని ఆయన ఉద్దేశ్యంగా భావించాలేమో నన్నారు. తాను ఎన్టీఆర్‌కు ఆప్తుడైన వ్యక్తినని 1982 మార్చిలో తెలుగు దేశం పార్టీ స్థాపన విషయమై హైదరాబాద్‌లో ప్రకటన చేసేందుకు మద్రాస్ నుంచి ఎన్టీఆర్, ఆయన సతీమణి బసవ రామ తారకం, మరో అభిమాని తిరుమల రావు, తాను కలిసి విమానంలో వెళ్లామని. అయితే ఎన్టీఆర్ రెండవ పెళ్లి చేసుకొన్న తరువాత తన వంటి నిజమైన కార్యకర్తలను దురదృష్టం వెంటాడిందని వాపోయారు. ఎమ్మెల్యేగా గెలిచిన తర్వాత మంత్రి పదవి అడగను ఎన్టీఆర్ ఇంటికి వెళితే తనను లక్ష్మి పార్వతి లోనికి వెళ్లనివ్వ కుండా అవమానించిన విషయం తానీ సభలోనే బయట

## జంటమంత్రులకు సత్కార సభలో రమేష్‌రెడ్డి మనోవేదన

పెడుతున్నట్లు వివరించారు. పదవి పోయాక ఎన్టీఆర్ నెల్లూరుకు వచ్చినప్పుడు, మొన్న ప్రసన్న వర్గీయులు టౌన్ హాల్‌లో పెట్టిన సభకు డబ్బులిచ్చి మనుషులను తోలించారని, తన కున్నంత కూడా ప్రసన్నకు టౌన్‌లో క్యాడర్ లేదంటూ పళ్లు కొరికి బల్ల చరిచారు రమేష్ రెడ్డి. ప్రసన్న విషయంలో అక్కడక్కడా రమేష్ రెడ్డి తొందర పడి పరుష పదాలు వాడారు; ముద్దు కృష్ణమ నాయుడాదులనూ అంతే కటువుగా విమర్శించారు. మంత్రిగా ఆ స్పృహ పనికి రాదండీ! చంద్రబాబు పదవి ఇచ్చినా, తాను ఎన్టీఆర్ అభిమానినేనని. ఎన్టీఆర్‌కు ఆరోగ్యం బాగుంటే అదే చాలని వుపన్యాసం ముగించారు. తనకు పార్టీ టిక్కెట్టు రావడానికి, ఇప్పుడు మంత్రి పదవి ఇవ్వడానికి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కారణమని, ఆయనను జన్మలో మరచి పోలేనని సెకండరీ విద్యాశాఖ మంత్రి దుర్గా ప్రసాద్ చెప్పారు. ఎమ్మెల్యేలు కంభం విజయ రామిరెడ్డి, ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, వేనాటి మునిరెడ్డి, దేగా నారసింహా రెడ్డి, వేమారెడ్డి రామచంద్రా రెడ్డి వేదిక పై ఆశీనులయ్యారు. ఎమ్మెల్యే శ్రీ పరసా రత్నం ఎన్‌టిఆర్ గొంతు ననుకరిస్తూ మిమిక్రీ చేశారు. పొద్దున్నంతా వేమారెడ్డి రామచంద్రా రెడ్డి వళ్లు... పోయేలా కష్టపడి, తోరణాలు కట్టి, సత్కారానికి సకల ఏర్పాట్లూ చేస్తే, వేదిక మీదకు ఆయన్ను పిలవ డానికి అందరూ మర్చి పోయారు. ఆ తర్వాత ఎవరో జ్ఞాపకం చేస్తే సభ మధ్యలో పిల్చి కుర్చీ వేశారు.

### జొన్నవాడ అభివృద్ధికి పాలక మండలి కృషి

93లో జొన్నవాడ మల్లిఖార్జున స్వామి కామాక్షి తాయి దేవస్థానం ట్రస్టు బోర్డు తాము పదవి చేపట్టిన తరువాత చేసిన అభివృద్ధి పనులను వివరించింది.

కొరవ 8 పేజీలో

# అధికార్లకు చెప్పే స్మగ్లింగ్ చందనం దాచి పెట్టుకున్నారు!

రాపూరు 13 కిలో మీటరు నుండి అడవిలోకి పోయే మార్గం వద్ద కడప జిల్లాకు చెందిన స్మగ్లర్లు 80 ఎర్ర చందనం దుంగలను మట్టిలో పూడ్చి వున్నట్లు విశ్వస నీయంగా తెలిసింది. ఈ దుంగలు పచ్చి ఆరిన తరువాత ఇక్కడి నుంచి మద్రాసు తరలించాలని పూడ్చి పెట్టారట. ఈ స్మగ్లింగ్ విషయం అటవీ శాఖాధి కారులకు తెలిసినా తెలియనట్లే వ్యవహరిస్తున్నారు. ముందే కుదుర్చుకొన్న ఒప్పందాల మేరకు అటవీ సిబ్బంది నిమ్మకు నీరెత్తినట్లు వుండడం వల్ల ఇప్పటికే కోట్లాది రూపాయల విలువ చేసే ఎర్ర చందనం మద్రాస్‌కు ఎగుమతి అయిపోయింది. కంచే చేను మేసిన చందాన వ్యవహరిస్తున్న స్థానిక అటవీ శాఖాధికారులను దారికి తెచ్చే ఉన్నతాధికారే కరువయ్యారు.

### ఖనిజ సంపదను కొల్లగొడుతున్నారు

ప్రభుత్వానికి చెందిన భూముల్లోని ఖనిజ సంపదను అక్రమంగా త్రవ్వి కొందరు స్వార్థపరులు అమ్ముకొంటున్నా రెవిన్యూ, అధికారులు పట్టీ పట్టనట్లు వ్యవహరిస్తున్నారు. చిల్లకూరు మండలంలోని పలు గ్రామాల్లో క్వార్ట్జ్, ఫెల్సుఫర్ ఖనిజాన్ని ఎటువంటి అనుమతి లేకుండా పట్ట పగలే త్రవ్వి తమ సొంతం చేసుకొని, మద్రాసుకు దర్జాగా ఎగుమతి చేసుకొంటున్నారు. వీరిలో ఎవ్వరూ రెవిన్యూ మైనింగ్ శాఖల నుండి లీజు పట్టాలు తీసుకొన్న పాపాన పోలేదు. ఎమ్మార్వో ఆఫీసును నెలసరి మామూళ్లలో ముంచెత్తు తున్నందున వారు ఈ విషయం పట్ల ఆసక్తి చూపడం లేదని విమర్శలు వస్తున్నాయి. ఇకనైనా సంబంధిత ఉన్నత శాఖాధి కారులు కల్పించుకొని పరిస్థితి చక్కదిద్దాల్సిన అవసరం వుంది.

### కుర్రు పట్టపుపాళెంలో కాపు సారా!

అల్లూరు మండలం ఇస్కపల్లి పట్టపు పాళెం, సముద్ర దీవిగా వుండే

**జిల్లావార్తలు**

కుర్రుపట్టపు పాళెంలో విరివిగా నాటు సారా కాస్తున్నారు. ఈ విషయం బయటకు పొక్కనీయకుండా కాసే వారికి త్రాగే వారే సహకరిస్తున్నారు. ఇక్కడ కాచిన సారాను ఇస్కపల్లి అరుంధతీయ పాళెంలో రహస్యంగా పెట్టి విక్రయాలు సాగిస్తున్నట్లు తెలుస్తూంది. పడవల్లో ఈ సారాను బంగారు పాళెం, రాముడు పాళెం గ్రామాలకు కూడా రవాణా చేస్తున్నట్లు చెప్తున్నారు. అల్లూరు ఎక్సైజ్ అధికారులు పాళాల పై దాడి చేసేందుకు భయ పడుతున్నట్లు వినికిడి. జిల్లా కేంద్రం నుండి స్క్వాడ్ బృందం పోతే గాని కాపు సారాకు అడ్డు అపు వుండదు.

# సంస్మరణ...

మా కుమారుడు

## దేవళ్ళ ప్రభాకరరెడ్డి

పరమపదించి **22.10.95** తేదికి ఐదు సంవత్సరాలు నిండినవి.

## పంచమ వర్ధంతి

సందర్భంలో వారి ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.



జననం: 11.12.1948 మరణం: 22.10.1990

దేవళ్ళ రామచంద్రారెడ్డి - శకుంతలమ్మ
మోడేగుంట

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరు

భవిష్యత్తులో దేశంలో తమ భవిష్యత్తును కాపాడు కోవలెనంటే ముస్లిం లేమి చెయ్యాలి?

మనకు సత్యా సత్యాలను తెలియ జేసే గీటురాయి ఏది? ముస్లిములు కాంగ్రెసు విరోధిస్తున్న బాట మారి నడిచి, ఈ పద్ధతిన తమ భవిష్యత్తు సురక్షితంగా వుంటుందో లేదో చూసుకోటమే. ముస్లింల చేతులో వున్న ఆ గీటురాయి. ముస్లింల బాధలకు వివిధ ముస్లిం సంస్థలు సూచిస్తున్న ఏ చికిత్సా కూడా ఫలదాయక పడదని నా గత ముప్పై ఏళ్ల అనుభవం బట్టి నమ్మకంగా చెప్పగలను. ఏదో ఆకర్షకమైన వివాదాల ద్వారా ముస్లింలను వాస్తవిక పరిస్థితుల నుంచి మరిపించలేము. వాస్తవికతను పురస్కరించుకొని పరిశీలించినచో మన బాటయే సరియైన బాట అని తెలియ గలదు. దృష్టి ముందు పరచిన పచ్చిక బయళ్లు చూచి ముస్లింలు కొలది కాలము పాటు బహుశః మోసపోయునేని ఎడారిలో ఎంత మాపుల వెంటాడి వెంటాడి అమాయ పచ్చిక బయలు చేరుకోలేక ముస్లింలు విఫల ప్రయాసతో అల్లాడి పోగలరు.

యిక మా యీ ప్రపంచము నుండి వాస్తవిక ప్రపంచములో ప్రవేశింతము. ముస్లిం శ్రేయస్సును కాపాడటము అనేదే మన కొటిబద్ధత తీసుచే. ప్యయం విద్యయు మాత్రము కాంగ్రెసుకు ఇంగి కృతజ్ఞసది. గనుక అనుమానాలకు వివాదాలకు తావులేదు".

మౌలానా ఆజాద్

### అవీ - ఇవీ

రెవెన్యూ ఆఫీసరు పి. వీర రాఘవులు నాయుడు గారు కనిగిరి తహశీల్ దారుగా బ్రాన్సుఫరు అయి నారు. ఒడి దుడుకులు లేకుండా ఆహార రధాన్ని సమర్థతతో నడిపి నందుకు ధన్యవాదాలు. ఆ స్థానానికి కె. సుందరేశం గారు వస్తున్నారు. వీరు బుద్ధ విగ్రహం. పరవా లేదు లెండి!

* * *

జిల్లా బోర్డు సెంట్రల్ మెడికల్ స్టోరుకు డాక్టరుగా అక్కా పంతుల కొండయ్య గారిని నియోగించారు. మహిత జ్ఞాన కుశలబున మంచుకొండ. ప్రదిత వైద్య గుణంబున పసిడి కొండ కొండయామాత్యు దనగ అల్పుంతె చెపుమా

అధ్యక్షా! మహాశయా! తమరెంత ప్రజ్ఞాచక్షువు లండి!

* * *





### హరికృష్ణ
మొదటి పేజీ కొరవ

ప్రయత్నించడం లేదు. ఇప్పటికే ఒక నెల గడచి పోయింది. త్వరగా ఖాళీ సృష్టించ కుంటే సకాలంలో ఎన్నిక నిర్వహించడం వీలు కాదు. మరీ ఆలస్యమైతే, శేషన్ పార్లమెంట్ ఎన్నికల వరకు ఉప ఎన్నిక జరపను పొమ్మంటాడు. అవి ఎప్పుడు జరుగుతాయో తెలియదు.

హరికృష్ణ ఇప్పటి కిప్పుడు పోటీ చేయాలంటే జర్పుర్ల మాత్రమే ఖాళీగా వుంది. ఎర్ర సత్యం మరణంతో ఏర్పడిన ఖాళీ అది. కానీ అక్కడ తెలుగు దేశం బలంగా లేదు. గెలవడం కష్టం.

కృష్ణ జిల్లాలో ఖాళీ ఏర్పడ కుండా తెలివిగా కాలం గడపడం ద్వారా గాని, జర్పుర్లలో ఓడించడం ద్వారా కాని హరికృష్ణను ప్రక్కకు తప్పించా లన్నది ఆలోచన అట. హరికృష్ణ అడ్డంకి తొలగి పోతే చంద్రబాబు - ఎన్టీఆర్ నీడ తమ పై పడకుండా, స్వతంత్రించి, తెలుగు దేశం పార్టీని తనదిగా, తన ఇష్టం వచ్చిన రీతిలో పునర్నిర్మించు కోవచ్చునని రామోజీ రావు సలహా. ఇదెంత వరకు ఆచరణీయమో వేచి చూడాలి.

### షేర్ లోకం
2 పేజీ కొరవ

ఇన్వెస్టర్లు ఫైనాన్స్ కంపెనీల షేర్ల పై జరిగే స్పెక్యులేటివ్ ట్రేడింగ్‌కు లోబడి పోతున్నారు. ఈ షేర్ల మాయలో మొదట కొద్దిగా లాభాలు కన్పించినా, అదే పనిగా స్పెక్యులేషన్ చేస్తే చాలా నష్టపోవలసి వుంటుంది. పెద్ద పెద్ద వడ్డీలకు డబ్బు తెచ్చి షేర్ల వ్యాపారం చేసే చిన్న పెట్టుబడి దారులు ఇది వరకు జరిగిన పాఠలను గుర్తుంచుకొని ప్రవర్తించడం మంచిది. ఒకటి రెండు నెలలైనా వారు ఓపిక పట్టాలి. డబ్బు చేతిలో రెడీగా వున్న వారు నమ్మకమైన, నిలకడ కల్గిన కంపెనీ షేర్లలో పెట్టుబడి పెట్టి, మళ్లీ బూమ్ వచ్చినప్పుడు ఇతర షేర్లకు ఆ డబ్బు మళ్లించు కోవచ్చు.

### పసితనంలో పివి జల్సారాయుడా?

# "ప్రధాని ప్రేమకలాపాల్లోని శృంగార ఘట్టాలు"

ప్రధానమంత్రి శ్రీ పివి నరసింహా రావు గత పదిహేను సంవత్సరాల నుంచి వ్రాస్తున్న ఆత్మకథా సూచితమైన నవల దాదాపు పూర్తి కావచ్చిందని వార్తా పత్రికలు చెప్తున్నాయి. ఆ నవలలోని కొన్ని భాగాలు అప్పుడే పత్రికలలో ప్రచురిత మైనాయి కూడా! ఆ నవల పేరు "ది అదర్ హాఫ్" (రెండవ వైపు). రాజకీయ వాదికి స్త్రీలతో గల సంబంధాలను అది వివరిస్తూంది. చదివే వారిలో వేడి నిట్టూర్పులు పుట్టించగల, శృంగార ఘట్టాలను వివరించే సన్నివేశాలు ఆ నవలలో చాలా వున్నాయి.

దీన్ని చదివితే, ఎవరికైనా థ్రిల్ కల్గుతుంది. ప్రతిష్టా కరమైన లండన్ టైమ్స్ పత్రిక కథనం ప్రకారం నరసింహా రావు గారు యవ్వన దశలో వున్నప్పుడు హైదరాబాదు నగరంలో పలువురు ఆడ స్నేహితులతో సంపర్కం నెరపారట. ఆ మధుర ఘట్టాలను ఆయన ఏ రూపంలో, ఏ భాషలో వర్ణించ నున్నారో తెలుసు కోవడానికి పాఠకులు, ప్రజలు ఊపిరి బిగబట్టి ఎదురు చూడవలసి వుంటుంది.

అయితే ఆ నవలలో నరసింహా రావు గారికి మహిళా నెచ్చెలులతో గల సంపర్కాలు వివరించడం తప్ప, ఆయనకు రాజకీయ పార్టీలతో గల సంబంధాలను చెప్పక పోవడం చాలా మందికి నిరాశ కల్గించి తీరుతుంది. అటువంటి వారందరికీ సంతోషం కల్గించే రీతిలో, ప్రధాన మంత్రి రెండవ నవల వ్రాతప్రతిని - ఆయన ఇప్పటికీ దాన్ని వ్రాయక పోయినప్పటికీ - మేము సంపాదించాము. ఈ నవల ప్రధాన మంత్రికి, కాంగ్రెస్ పార్టీకి మధ్య వున్న ఉడుకెక్కించే ప్రేమ కలాపాన్ని వివరిస్తుంది. అందులో వీరిద్దరి మధ్య నడచిన పలు ఆసక్తికర ప్రేమ ఘట్టాలు వున్నాయి. వాటిలో కొన్ని చదవండి.

"వారిద్దరూ నిశ్శబ్దంగా చాలా సేపటి నుంచి పవళించి వున్నారు. ఎంతో సమయం గడిచి పోతూంది. చుట్టూ చీకటి; ఘడియలు గడిచే కొద్దీ, సమీపంలో ఎక్కడా వెలుతు రన్నది లేదని స్పష్టమౌతూ వుంది. చీకటి మరింత దట్టంగా ముసురు కుంటున్నది. ఇద్దరూ దగ్గరగా, మరింత దగ్గరగా జరుగుతున్నారు.

నరసింహా రావు తమకంతో కాంగ్రెస్ వైపు చూశారు. ఆమె ఆయన్ను అనుకొని, మదన తాపంతో మత్తు చూపులతో పవళించి వుంది. ఆ చీకటిలో కూడా ఆమె కళ్లు కోరికతో మిలమిల మెరుస్తున్నాయి. ఆమె చూపుల్లో అతడేదో చేస్తాడన్న ఆశ వుంది. ఆ వలపు చూపుల తీక్షతను తట్టుకోలేక ఆయన వెంటనే తన దృష్టిని ప్రక్కకు మళ్లించాడు ఆలోచనా మగ్నుడైనాడు.

ఆయన మనసు గతం వైపు మళ్లింది. తామిద్దరం కలిసి ఎంత కాలం నుంచి ఒకే చోట జీవిస్తున్నాం? యాభై ఏళ్లా? అరవై కూడా పూర్తయ్యాయా? అయినా తామిద్దరం ఎప్పుడూ "ఆ పని" చేయలేదు. తమకు ఎన్నో అవకాశాలు వచ్చాయి [illegible] ఒక రూపంలో ప్రతిసారీ ఆ [illegible] జారిపోయాయి.

ఆమె భారంగా శ్వాస పీలుస్తున్న చప్పుడు, ఆమె నాసికాగం

### రాజేందర్ పూరి

నుంచి తన వంటికి తగులుతున్న వేడి గాలిని అర్థం చేసుకొంటే తమకు మరొక మధురమైన అవకాశం లభించిందని స్పష్టమౌతూంది. ఆలోచనల్లోనే ఆయన కొద్ది సేపు తన వూపిరి బిగపట్టారు. ఆ నిశ్శబ్దంలో ఆమె వేడి నిట్టూర్పుల చప్పుడు మరింత స్పష్టంగా చెవులకు సోకుతున్నది. ఆ నిట్టూర్పుల వెనుక ఆమె మదన తాపపు తీవ్రత తేట తెల్లమౌతుంది. అవి కోరిక చప్పుళ్లే తప్ప, కాంగ్రెస్‌కు తరచూ వచ్చే ఉబ్బస రోగపు వెక్కిళ్లు కాదని తెలుస్తూ వుంది.

అయితే తానిప్పుడేమి చేయాలి? ఎట్లా ప్రతి స్పందించాలి? తన మొదటి చర్య ఏమిటి? "పని" ఎట్లా మొదలు పెట్టాలని మధన పడుతూ ఆయన మరింత దీర్ఘంగా, ఏకాగ్రతతో ఆలోచించడం మొదలు పెట్టారు.

ఆ ఆలోచనలోనే ఆయన తన తలను ఆమె ఒడిలో చేర్చి, ఆమె అనురాగాన్ని భౌతికంగా చవి చూస్తున్నారు. ఆమె అతడి బట్టతల పై తన సున్నితమైన వ్రేళ్లతో సుతారంగా నిమురుతూంది. అట్లయినా అతడి నరాలు తన గుండె చప్పుళ్లకు అనుగుణంగా ప్రతిస్పందిస్తాయని ఆమె ఆశ.

అప్పుడప్పుడు ఆయన ఆమె తలను తన ఒడిలో వుంచుకొని, ఆమె కేశాలను నవరిస్తున్నారు. ఆమె వూపిరిలో తన వూపిరిని కలిపి వినోదిస్తున్నారు. వారిద్దరి శరీరాలలోని లక్షలాది నరాలు ఒక దానికొకటి లయబద్ధంగా చలిస్తున్నాయి.

ఆవేశం రేగినప్పుడు ఆయన ఆమెకు మరింత దగ్గరగా జరిగి స్వీట్ నథింగ్స్ వంటి మాటలు ఆమె చెవిలో గుసగుసలుగా చెప్తున్నారు. కొద్ది సేపు గడిచే సరికి ఆ స్వీట్ నథింగ్స్‌లో స్వీట్ మాయమై నథింగ్స్ మిగుల్తున్నాయి.

ఆయన ఇంకా అదే నిమగ్నతతో ఆలోచిస్తున్నారు. ఆమెతో ఆ పని ఎట్లా చేయాలా అన్న ఆలోచన ఎంతకీ తెగడం లేదు. ఆలోచించి ఆలోచించి అలిసి పోయారు. పని ఎట్లా మొదలు పెడితే బాగుంటుందో తెలడం లేదు. అప్పుడాయన మనసులో ఒక మెరుపు మెరిసింది. తానే రకంగా పనిచేస్తే ఆమె ఇష్ట పడుతుందో తెలుసుకో వాలన్పించింది. ఆమె వైపు మరొకసారి నిరామయంగా చూశారు. అప్పటికే ఆమె కళ్లు మూత పడి వున్నాయి. చిన్న గురక కూడా విన్పిస్తూంది. ఆమె నిద్రలోకి జారుకున్నది. ఆయన కెంతో రిలీఫ్ అన్పించింది. ఆమెతో పని చేయడానికి లభించిన వెయ్యిన్ని ఆరు వందలా యాభై మూడవ అవకాశం ఆ విధంగా వెళ్లి పోయింది. రేపు రాత్రికి తామిద్దరికి ఇటువంటి ఛాన్స్ మళ్లీ దొరకక పోతుందా అన్న నమ్మకంతో ఆయన ఆమె నుంచి దూరంగా జరిగి, అటు ప్రక్కకు తిరిగారు. క్షణాల్లో నిద్ర ముంచుకొని వచ్చింది. ఇద్దరి గురకలూ ఆ గదిలో ప్రతి ధ్వనిస్తున్నాయి.

*తానీ పని చేయాలా?*

*లేక ఆ పని చేయాలా?*

*లేక తాను ఏదీ చేయకూడదా?*

*తాను బౌలింగ్ చేయాలా?*

*బ్యాటింగ్ చేయాలా?*

*లేక గమ్మునబాల్ జేబులో వేసుకొని*

*ప్రక్కకు వెళ్లి పోవాలా?*

* * *

ప్రధాన మంత్రి శ్రీ పివి నరసింహా రావు గారి నాన్పుడు రాజకీయ వైఖరిని వ్యంగంగా, సున్నితంగా విమర్శిస్తూ ప్రఖ్యాత జర్నలిస్ట్ శ్రీ రాజేందర్ పూరి వ్రాసిన సెటైర్ ఇది. కలకత్తా నుంచి ప్రచురితమయ్యే 170 ఏళ్ల పురాతన, ప్రసిద్ధ, ప్రతిష్టాకర పత్రిక "ది స్టేట్స్‌మేన్" ఈ సెటైర్‌ను ప్రచురించింది. దానికి తెలుగు అనువాదమే పై వ్యాసం. (సం.)

### మళ్లీ పెరిగిన అమెరికా డాలరు

అమెరికన్ డాలరు విలువ మళ్లీ పెరిగి పోయింది. 15 రోజుల క్రితం ఒకసారి పెరిగి, నిలకడగా వుండింది. ఇప్పుడు తిరిగి ఎగబ్రాకడం మొదలు పెట్టింది. ఇప్పుడు ధర 35 రూపాయలు. రూపాయి మారకం విలువ ఇంతగా పడి పోవడం ఆందోళన కల్గించే విషయం.

### కొనేవారులేరు
2 పేజీ కొరవ

అమ్మకానికి పెట్టారు. అయితే వీటికి ప్రభుత్వం ఆశించిన ధర రావడం లేదు; అమ్మకాల స్థాయి జోరుగా లేదు. ఆయా కంపెనీల షేర్ బుక్ వాల్యూకు రెండు రెట్లు అదనంగా మాత్రమే కొనుగోలు చేయడానికి ఆర్థిక సంస్థలు ముందుకు వస్తున్నాయి.

ఈ ప్రకారం అమ్మకాలు జరిపితే పిఎస్‌యు షేర్ల అమ్మకాల ద్వారా ప్రభుత్వానికి రెండు వేల కోట్లకు మించి సమకూరే అవకాశం లేదు. అంటే బడ్జెట్ అంచనాలలో 5 వేల కోట్లు ఆదాయం తగ్గుతుందన్న మాట. అంత మేరా లోటు పెరిగి పోయినట్లే లెక్క. దీని ప్రభావం వచ్చే సంవత్సరం కన్పిస్తుంది. రాబోయే ఆర్థిక మంత్రికి ఆదాయానికి, ఖర్చుకు పొంతన కుదరక నిద్ర పట్టని రాత్రులు ఎక్కువౌతాయి.

# అశ్రుతర్పణం



మా తండ్రి

## శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డిగారు

12.10.1995 తేది గురువారం స్వర్గస్తులైనారు.
వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ, అశ్రుతర్పణం అర్పిస్తున్నాము.

వారి ఉత్తరక్రియలు

| | | |
|---|---|---|
| 7.11.95 తేది | మంగళవారం | నిలుపు |
| 8.11.95 తేది | బుధవారం | పందిరి |
| 9.11.95 తేది | గురువారం | ఎత్తురేవు |
| | | బ్రాహ్మణబియ్యాలు |

నెల్లూరు జిల్లా రామన్నపాళెంలోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

వెంకట సుబ్బారెడ్డి - ప్రభాకరరెడ్డి
వసంతకుమార రెడ్డి

జననం:5.3.1923 మరణం:12.10.1995

---



Shop: 27449
Resi: 27650



ఆహ్వానము



# మోహన్‌రెడ్డి జ్యూయలర్స్

A/C షోరూం

13/420, కాకర్లవారివీధి, చిన్నబజారు - నెల్లూరు -1.

## ప్రధమ వార్షికోత్సవం సందర్భంగా

26.10.95 తేది నుండి 2.11.95 తేది వరకు

## గొప్ప తగ్గింపు

మా ఖాతాదారులకు రాళ్ళరేటు, తరుగు, కూలీ లేకుండా
22 క్యారెట్ల బంగారు ఆభరణములు ఇవ్వబడును.

ఇట్లు
చెరుకుపల్లి బ్రదర్స్ & సన్స్

Edited, Printed and Published by Nellore Dolendra Prasad at Zaminryot Press, Offset Printed at Nayagara Paper Products (I) ltd., NELLORE